# యు ద్ధ భూ మి

(నూతన రాజకీయ నాటకము.)



ఆంధ్రా బెర్నాడ్షా.

వే దాం త క వి.



కవితాసంస్థాన ప్రచురణ

ఉ. శేషుఁడు కీర్తిశేషుఁడు కృషీవలదాసుడు
బుల్లెమాంబ సం
తోషహృదంతరాళ నవతూర్య నివాసుఁడు
శత్రులోక వి
ద్వేషమదేభసింహుఁడు, కవీడ్జననందన
రత్నసౌధ శి
ర్భూషకళావిలాసుడు సిరుల్ కొలఁబోసెను
కైకరమ్ములో.

మ. సకలైశ్వర్యము బుల్లెమాంబ కవితాసౌందర్య
సౌజన్య వి
శ్వకళాగారముఁ జేసి, శేషునితలన్ భద్రంబుగా
నిల్పి, మ
ల్లికయై, వల్లికయై, జగజ్జననియై, లేఖ్యభ
స్తోత్ర వా
చకమై చల్లని నోమునోచినది శేషస్వామి
సావిత్రియై.

ఉ. ఇయ్యెలనాగ చక్కని మహీమహిళామణియై
జగాన జ
గ్గయ్యనునామధేయుని దయారసభాగ్య
కనిష్ఠపుత్రియై
వెయ్యియుగాలు బుల్లెముగ వెల్గి సహస్ర
ఫణీంద్రుఁడైన శే
షయ్యధరాతలేశ్వరుని జ్ఞానమహేశ్వరి
యయ్యె హాయిగా.

ఉ. తీయని తోడఁబుట్టువయి ధీనిధి శ్రీ యలి
శెట్టి సత్యనా
రాయణమూర్తి చెంగట; సరస్వతియై, మఱి
బుల్లెమయ్యెఁ; ద
ద్ధ్యేయము నూచి శేషుఁడు వరించి కదా
శిరసావహించె ము
ఖ్యయువతీలలామను మహీమహిళామణిగా
ప్రసిద్ధిగన్.

మెరుపై తొడిగెగా పేరునిల్పఁగ నీకు
నూరుయుగాల బంగారుతొడుగు
జలధియై లేపెగా జయదుందుభి నీకు
దేశ దేశాల కీర్తి ప్రతిష్ఠ
తనయుఁడై తలచెఁగా దయవుట్టగానీకు
వేదవేదాల గంభీరసూక్తి
రసికుఁడై కొలిచెగా రసమాధురిగ నీకు
రత్నమాణిక్యాల రాశి రాశి

గీ. ఏమి తక్కువ చేసెనేఁడింక నీకు
శయ్యయై గ్రాలె నింత శేషయ్య విభుఁడు
వాని బుల్లెమ్మ బొజ్జ నీ పసిండిరాశి
ఏలవయ్యా కైకవర గోపాలరాయ.

క. ఈ పాపలఁ గాపాడుత
గోపాలకచక్రవర్తి కూరిమితోడన్
మాపాటలు మాయాటలు
నేపారు ముదంబుతోడ నిలపై నిలుపన్.

పాదరక్షలు నా మిత్రవరులు సుమ్మి
నన్ను మోసి నావ్యథ పంచుకొన్నవయ్యా
ఇంతకన్న స్నేహితులు నా కెవరు గలరు
భక్తజనులార ! కమ్మని వక్తలార.

ఆంధ్రా బెర్నార్డ్షా.

31—3—1951

వేదాంతకవి.

# పాత్రలు

పురుషులు :

ధర్మరాజు

కృష్ణుడు

అర్జునుడు

దుర్యోధనుడు

దుశ్శాసనుడు

శకుని

కర్ణుడు

ద్రోణుడు

అభిమన్యుడు

మిత్రుడు

భీముడు

నకులుడు

సహదేవుడు

సైంధవుడు

వార్తాహరుడు

స్త్రీలు :

ద్రౌపది

ఉత్తర

# యుద్ధ భూమి.

## ప్రథమాంకం

### 1 వ రంగం.

### యుద్ధశిబిరం.

ధర్మరాజు ప్రవేశం

ధర్మరాజు:—

శ్రీరమణీలలామ సర
సీరుహకోమలపాణి పల్లవా
ధార శుభావతార నవ
తామరసాక్షుడు చక్రధారియై
మా రథముల్ మనోరథ ర
మా పథముల్వయి సాగునట్లు యీ
భారతయుద్ధరంగ విభ
వంబు జయప్రద మెల్ల జేయుతన్.

ధర్మక్షేత్రమై కురుక్షేత్రమై యీ వీరభారత విశ్వమహారణరంగము భావిలోక భాగ్యోదయం కోసం దిక్కుల కెగదన్నెడి మహాప్రతాపవజ్రకవచధారులతో భూనభోంతరాళాలను పగిలించి ప్రచండశతఘ్నులు అఖండశతసహస్రకోటి మేఘధనుష్టంకారదంభోళిప్రళయగర్జనలతో చతుర్దశభువనాలను దద్దరిల్ల జేస్తున్నై.

ప్రచండగ్రీష్మకాల ప్రళయమార్తాండుడై అనివార్యశౌర్యబలపరాక్రమసింహరణధుర్యుడై భీష్ముడు మదీయ సైన్యనివహంబులను భీభత్స మొనర్చు చున్నాడు.

మా గాండీవి ధనుర్బలై క రణని
ర్మాణ ప్రతాపాగ్ని నేఁ
డీ గాంగేయుని బాణవృష్టి పడి యి
స్సీ! లెస్సగా నారి దు
ర్యోగంబుల్ పయివేయు కాల మిక యు
ద్ధోన్మాదమై యే పరి
త్యాగంబుల్ మఱి పాండవేయులకు ప్రా
ప్తంబై ప్రకంపించునో!

దుస్సాధ్యమైన దుష్టచతుష్టయ మంత్రాంగాలతో దుర్భేద్యమైన ద్రోణాచార్యధనుర్విద్యాదర్పాలతో వీరభారతసంగ్రామక్షోణి ప్రళయ కాలసంక్షోభములు దిగ్దిగంతరాళంబులు మారుమ్రోగించి భూనభోంత రాళంబులు పగులగొట్టుచున్నవి.

మా భీముండు బడాయికౌరుడని ధ
ర్మక్షేత్రమందింక మ
త్తేభంబుల్ పరిహాసముల్సలిపి నేఁ
డీ పై డియంబారిపై
లోభస్వాముల జేరఁదీసుకొని భూ
లోకంబునన్ పెద్దసం
క్షోభంబుల్పగిలించి దుష్టకురురా
జున్ మోసి కీర్తించునా!

ఇంకను యీనాటి వీరభారతయుద్ధవార్తలు చెవినిఁబడవేయు టకు వార్తాహరుడు రాలే దేమికారణమో! ఒకవేళ యీ లోకభయం కరసంగ్రామదుర్గమారణ్యపరాక్రమసింహుడైన భీష్ముని శరధాటికి నిలువ లేక, గెలువలేక మాభీమార్జునసైన్యకోటి పలాయనమంత్రచింతనతో

పరిభవదవాగ్ని ధూళిధూమపరాఙ్ముఖాలతో ఎక్కడైనా పడియుండెనా యేమి? కాదు కాదు. అట్లెన్నటికీ కాదు. అపశకునంబులు శమించు గాక!

అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుడైన శ్రీకృష్ణభగవానుడు సుదర్శనధారియై మా పాండవేయుల చైత్రయాత్రమనోరథసారథియై మా యండనుండ మాకు పరాభవమన్నదియు, తిరోగమనమన్నదియు యెన్నటికీ లేదు. మాకు, మా పాండవచమూసమూహమునకు జగదేకవీరుడైన శ్రీకృష్ణపరమాత్మని దివ్యకటాక్షభాగ్యమున్నంతవరకు మా కపజయము లేనేలేదు. ముమ్మాటికిని అంతిమజయం మాకే లభించితీరగలదు.

ఈధృతరాష్ట్రపుత్రుడు మ
ఱింక జయించుట దుర్ఘటంబు భూ
మీాధవులెల్ల మాకు ప్రణ
మిల్లుట లొంగుట నిక్కవంబు మా
యోధులు వీరభారత ర
ణోర్వి ఁ జయించి చతుష్పయోధి వే
లాధరణీతలేంద్ర జయ
లక్ష్మిని ఁదెచ్చుట వాస్తవం బహో!

(వార్తాహరుడు ప్రవేశం)

వార్తా:—ధర్మరాజ సునామధేయా! నమస్కారము.

ధర్మ:—సరి సమయానికే వచ్చితివి. అయితే గెలుపు మనదేనా? భీష్ముడు మడిసెనా?

వార్తా:—ఏమని యుద్ధఘట్టముగుఱించి విన్నవింతును...

ధర్మ:—అదేమిటి - చెప్పవేమిటి?

వార్తా:—ఏమున్నది. ఈ త్రిభువనాలలో...

ధర్మ :—ఆ...ఆ...ఏమిటి ? ఈ త్రిభువనాలలో...ఏమిటి ?

వార్తా :—భీష్ముని...

ధర్మ :—భీష్ముని ... ఆ ... ఏమిటి చెప్పు - గెలవటం కష్టసాధ్యమైన పనియా యేమిటి ?

వార్తా :—ముమ్మాటికీ త్రిమూర్తులైదున్గానిగూడ భీష్ముని జయించలేరు.

ధర్మ :—ఆ... ఇంకనూ పితామహుడైన భీష్మాచార్యుడు మా ఫల్గునుని నిశితాస్త్రములకు కూలలేదుగా !

వార్తా :—లేదు స్వామీ! అది అనుకొన్నంతగా సాధ్యపడేదిగాదు.

ధర్మ :—ఈ శతవృద్ధపితామహుడైన భీష్మాచార్యుడే పోరు ఘోరమ య్యేట్లుగా పరాక్రమించుచున్నప్పుడు ఇంకా యీ యఖండ ధనుర్విద్యాకోవిదుడైన ద్రోణాచార్యునిమటుకు మా భీమార్జున నకులసహదేవులు కడగించుట కలలోనివార్త. జగదేకవీరుడైన త్రివిక్రముడు మా ఫల్గునునికి రథసారథియై సంగ్రామజయము సాధించలేనప్పుడు యికముందు మా పాండవేయులు కురుపతిని కూల్చుట యెట్లో, భుజాస్ఫాలనము జేసి వీరభారత సంగ్రామ విజయధ్వజారోహణజేయుటయెట్లో తోచకుండావున్నది. అయితే కృష్ణార్జునుల సమరోత్సాహము, ప్రచండ యుద్ధనితి కౌశలము సన్నగిల్లిన వన్నమాట ! పాపం ! ముదివగ్గుతో రోజులతరబడి కలియబడి, పెనగులాడి అంత అలసి సొలసిపోయి వున్నప్పుడు యీపన్నాత్రం యుద్ధ బడలిక తీర్చుకొనుటకు వీరభారత వీరనారీమణుల కర్పూరహారతులను పట్టించుకొని పోగూడదా ? ఫల్గునుడట ! పరాక్రమసింహుడట ! అరిలోకభయంకరుడట !

పోరునకుం త్రివిక్రముని
ముందిడుకొన్న ధనంజయుండు వి
స్ఫారధనుర్బలాలు ముది
వగ్గుపయిందుమికించి, వాని కా
ల్గోరు కదల్పలేని శర
కోవిదుడై తుదకింక గుండె బే
జారయి యొగ్గు సిగ్గు దిగ
జారినవాడయి వెన్నుజూపెనా ?

వార్తా :—శతసహస్రకోటి ఫాలాక్షులకుగూడా లొంగని త్రిలోక భయంకరవీరరససముద్రుడైన భీష్ముని శరధాటి కెవరు వెన్ను జూపరు స్వామీ ?

ధర్మ :—ఆ ... భీష్ముడంత చండతరప్రతాపాగ్ని పర్వతమై మావిజయుని, విజయసారథిని దిగ్భ్రమ గొల్పెడి పలాయనమార్గం పట్టించుచుండెనుగా ! ఆహా ! సింహము ముసలిదైనను పరాక్రమపౌరుషములుమాత్రం తగ్గవన్నమాట !

విజయుడు విల్లువీగి మొలి
వెట్టిన మానము పట్టుదప్పి, దో
ర్భుజబలరోషపౌరుషము
బొత్తిగసీరయి, విల్లుజారి, పం
కజనయనుండు దిగ్భ్రమము
నన్ రథమున్నడదారిపెట్టున
ట్లు జయము వద్దటంచరుల
లో నగుబాట్లకు పారిపోయెనా ?

ఇటువంటి పిరికిపందలను నమ్ముకొని నేనింత లోకభీకరసంగ్రామ కార్యమునకు నడుముగట్టి, ప్రతిజ్ఞబట్టి దిగుటయే నా బుద్ధి పొరబాటు.

రణరంగంబున నెంతగా హరిహర
బ్రహ్మాదులుగా తోడు వ
చ్చిన నీసంగరమన్న భీరులకు ని
స్సీ! లాభమేముండు; న
ర్తనశాలం తయితక్కలాడు నరునిం
రప్పించి శౌర్యాగ్ని వృ
ష్టిని వర్షించెడి పోరుకంపిన జయ
శ్రీలేమి సాధించునే?

ఇకమీదట మా యీ వీరభారత క్షేత్రమందు వీరపౌరుషసింహాలకు స్థానం లేదు గాబోలు !

పట్టి బిభీషికల్ పలికి
వైరులపై మఱి కుక్కిమంచమునం
బట్టెడి యింత ముగ్గుముది
వగ్గులముందిక నిల్వలేక సా
మ్రాట్టు సిరుల్గులటించి తెగ
బారలుసాచి, జగాన మా జగా
జెట్టులు వీరభారతప్ర
సిద్ధిని దగ్ధముసేయ నిల్చిరా?

వార్తా:— స్వామీ! మీ రిప్పుడన్నంతగా పిరికిపందలు పాండవేయులలో మఱెవ్వరూ లేరు.

ధర్మ:— లేనప్పుడు ఇంత శతవృద్ధపితామహుడైన కురువృద్ధుని ముది వగ్గుని నిర్జించుట కింత కాలయాపన యేలనయ్యా?

వార్తా:— అయ్యా! భీష్ముడు వయసులో వృద్ధుడైనప్పటికి యుద్ధకౌశలంలో అతడికి చాలెడి బుద్ధికౌశలం గలవాడు పుట్టలేదు. ముందు పుట్టబోడు. అటువంటప్పుడు అప్రతిహతమైన వీరాగ్రేసరుని నిర్జించుటకు కొన్నాళ్లు వ్యవధి తీసుకొనక తప్పదు.

ధర్మ:— ఇక చాలు నీసందేశము నీసదుపదేశము అక్కడ యుద్ధభూమిలో పరిస్థితి యిప్పటి కేతీరుగా మారినదో చూచి మన పక్షమునకు జయము సిద్ధించినప్పుడు గాని నీవు రాకుము. నా శ్రవణేంద్రియములు యుద్ధవిజయకథాకలాపములే వినునుగాని వేరొకపనికిమాలినగొడవ విననొల్లవు. నీవు యిప్పటి యుద్ధపరిస్థితి యెట్లున్నదో గమనించుటకు వేగిరమే పోయిరమ్ము.

వార్తా:— చిత్తముస్వామీ! శలవు. నమస్కారములు.

ధర్మ:— మంచిది పోయిరమ్ము.

(వార్తాహరుడు నిష్క్రమించును)

నాహృదయములో అదేమిటో చెప్పశక్యముగాని పెద్దరాపిడులు రేగజొచ్చెను. ఈవార్తాహరుడు యుద్ధపరిస్థితి నన్వేషించుటకు నావద్ద లవుతీసుకొని వెళ్ళుచున్నప్పుడైనను నానోటినుండి 'విజయమగుగాక' యను విజయాశీర్వచనవాక్కు రాలేదేమికారణమో! అన్నియు అవకతవకలే, అధోగతులే కంటికి కానవచ్చుచున్నవి. ఈకురుపితామహుడు యుద్ధరంగమందు కూలినప్పుడుగదా నామనన్సు కుదుటబడి నిర్మలముగా నుండగల్గుట. (ముందుకుజూచి) ఓహో! ఎల్లప్పుడూ ఈ ద్రుపదరాజపుత్రికకు సరససల్లాపములే కావలయునుగాబోలు! ఔను. అనూర్యం

పత్న్యయైన యీ రాచకన్నియ మమ్ములఁ జెట్టబట్టినదాది కష్టకాపురము లోనే కాలము గడుపుచున్నది. పోనీ, యీమె యదృష్టముతోనైనను సత్వరమే మాకు విజయప్రాప్తి కాఁగూడదా !

(ద్రౌపది ప్రవేశం)

ద్రౌప:—ఎప్పుడూ ఏదోయొక గొడవలోనే నిమగ్నులై వుంటే మనస్సు కింక విశ్రాంతియెప్పుడు?

ధర్మ:—అదృష్టవతి యిల్లాలుగా వచ్చినప్పుడే మనస్సుకు విశ్రాంతి.

ద్రౌప:—ఐతే నా మూలమున మీకూ, మీ తమ్ములకు మనస్సుకు విశ్రాంతి లేదన్నమాట!

ధర్మ:—లేకేమి. నీవల్లనే కొంచెమైనను యీమాత్రపు విశ్రాంతి దక్కినది. ఐతే, నీవు అబలవు- ఆడదానవు- ఆగర్భశ్రీమంతుల యింటిలో పుట్టినదానవు. ఈనాఁడు మాపాలిటఁబడి అవస్థలు పడుచున్నదానవు, నీకు మా అవస్థలుగాని, యీనాటి యుద్ధపరిస్థితులుగాని మాకు పట్టినట్లు నీకు పట్టవు.

మగువా ! ఈ నరజన్మలో సుఖము స
న్మానమ్ము మీస్త్రీలకే
తగియున్నట్టిక స్పష్టమయ్యె; విధివ్రా
తల్లోఁడ మీజన్మకే
నగిషీల్వెట్టి మఱెంత పెద్దధర వి
న్నాణంబుగాఁ గుల్కఁజే
సెగదే! మీతొలిజన్మపూజలెవియో
శృంగారసౌదామినీ !

ద్రౌప :—మనోహరా! నేను మాపుట్టింటి మహదైశ్వర్యానికి మురిసి పోయెడిదాననుగాను. జగద్విఖ్యాత చరిత్ర ధరిత్రీరమణులైన తమవంటి ధర్మనిష్ఠాగరిష్ఠులచేత కొనియాడబడుటకు అర్హురాలనూగాను.

మీ జగదేకవీర పర
మేష్ఠి పదాబ్జయుగమ్ము నమ్మి నృ
ద్వీజనులెల్ల ముక్కుపయి
వ్రేలిడునట్టు లరణ్యసీమలో
రోజుల నెన్నియో గడపి
రోయక, పాయక మిమ్ము; మీపరి
వ్రాజకవేష మూనితి నృ
పా! నను మీరికనుగ్రహించుడీ.

ధర్మ :—నిన్ననుగ్రహించక మేముకోసుకొనితింటున్న దేమున్నది. ఇంత మహాయుద్ధఘట్టము నెత్తికెత్తుకొన్నదిగూడా ద్రుపదాత్మజా! నిన్నుగుఱించియేకదా!

కాంతారమ్ములకేగి తీరని మహా
కష్టాలలో వేగి, యీ
కౌంతేయుల్ సుతిమెత్తనైన తనువుల్
గాయమ్ములై పోయె; నీ
వెంతో వాడినుడుల్ చురుక్కుమనున
ట్లీ పుండ్లపై గ్రుచ్చి యే
డ్పింతప్పు వృథాకృథానలకథా
హేమాక్షీ! రాకాసివై.

ద్రౌప:—స్వామీ! మిమ్ము ప్రేమరసార్ద్రహృదయులుగా నేనేమి నోములు నోచుకొని చేసుకొనవలయునో తోచకున్నది. దగ్గఱి కెప్పుడు వచ్చినను చెప్పనలవిగాని ఏదోయొక విసుగుదలతో మీరూ, మీతమ్ములూ కనుపించుచుందురేగాని, అష్టకష్టముల కోర్చి, అరణ్యావాసములకు సహించి, అన్నవస్త్రములకువాచి ఆదరాభిమానములకురోసి పడరానిపాట్లుపడుచున్న సమయము లలోఁగూడ మీ ఐదుగురన్నదమ్ములనూ నాయిష్టదైవములుగా భావించి పూజించి, కడకు మీవల్ల నేనుపరిగ్రహించునది అను గ్రహమునకు బదులు ఇంత ఆగ్రహమా ప్రాణేశ్వరా? యుద్ధ ములో అలసి, సొలసి వచ్చుచున్న తమకు నేనేదియో కొంత బడలికదీర్చి విశ్రాంతినిచ్చుటకు నేనిచ్చటకు రాదగనా?

పురుషులకెల్ల మీదు పువు
బోండ్లుగదా సొగసైనమూర్తి, సు
స్థిరమయినట్టి కీర్తి గొని
దెచ్చుట మెచ్చుట; మీరు మీసహో
దరులు మహీస్వయంవరస
దస్యసభాసముఖాన నన్ను ము
న్నరసి పరిగ్రహించినది
యందులకేగద పాండవాగ్రజా!

అంతియేకాక, పూర్వమునుండి ప్రేమరసము, వీరరసము కురిపించ లేని నీరసస్థితివలననే జగత్కల్యాణము యీనాటివరకు జరుగకున్నది.

మీసములేల భూప్రజకు
మిక్కిలిమక్కువ? మీసముల్ గదా
తేఁపసతిఁ జెట్టపట్టని య
మాయకవేషము జూపబట్టి వి

శ్వాసము, గ్రాసవాసము, ప్ర
భావము, జీవము ప్రగ్గిమగ్గి మీ
మీసములెల్ల నిప్పుడిక
మెత్తనికత్తికి లొంగుటబ్బెగా!

ధర్మ:—ప్రేయసీ! నీవదేమిటో శ్లేషార్థముతో అన్యాపదేశముగా మమ్ముల నాడిపోయుచున్నట్లు వ్యక్తమగుచున్నది. ఒకచెంప తమ్ములేమో బీరములు పలికిపలికి, జబ్బలు కొట్టికొట్టి తుట్టతుదకు యుద్ధభూమిలో శతవృద్ధుడైన భీష్మునితో గూడా పోరాడనేరక, నాకు నలుగురిలో తలవంపులు దెచ్చిపెట్టి, బయటికడుగిడకుండా జేసినందులకే నేడెంతయో వ్యధబడి కమిలికుమిలి పోతున్న నన్నెందుకు నీవుగూడా నిర్దాక్షిణ్యముగా, నిష్కారణముగా బాధింతువు?

ద్రౌప:—ఔనుస్వామీ ఔను, నేనేదిజెప్పినను మీకిపుడు బాధగానే వుండగలదు.

హాయిగ నింటనుండి పర
మార్థము విప్పెడి వారికేమి నే
డీయురిలోక భీకరమ
హీస్థలి బ్రద్దలుజేయు యుద్ధపా
రాయణమర్థమౌను, సమ
రస్థలిపై పిడుగుల్ రణధ్వనుల్
తీయగ మెక్కగల్గెడి జి
లేబులు గా వవలీల దుంచగగ.

ధర్మ:—చాలుచాలు. సరసముకాస్తా విరసములోనికి దించినది. ఆడదానవు నీకు మాగోడవలేల- యుద్ధశాస్త్రప్రసంగములేల?

ద్రౌప:—ఇంటిపెత్తనాలు చెలాయించుచుండెడి యింతింత పెద్దతలలు పగవారి వింటిదెబ్బలకు వెఱచి, అన్నిటిలో తమకంటె పిన్నలైన వారిని యుద్ధరంగమునకు దుమికించి, వచ్చిపడు జయలక్ష్మి కోసం ఉవ్విళ్ళూరుచున్నప్పుడు నేడు మీ వీరభారతనారీరత్నములు యుద్ధశాస్త్రప్రసంగము లెత్తుకొనుటయే గిట్టని పనియా?

ఎప్పుడు యుద్ధరంగమున
కేగి రిపుప్రకరమ్ముతోడ క
త్రెప్పలు వాల్చకుండ ధర
త్రిస్థలికోసము పోరుచుండిరో
ఇప్పుడు తమ్ములీ యలపు
నించుక తీర్చుకొనంగ మీరు మీ
త్రుప్పునుబట్టు విల్లునిక
దుల్పి రణస్థలికేగుటొప్పదే ?

ధర్మ—ఇంతీ! యెటువంటిపోరునైనా గెలిచిరావచ్చుగాని ఇంటిపోరు మటుకు వెల్చుట దుర్ఘటము - దుర్లభము. అసలు—

యుద్ధమునేయబోవు రణ
యోధులకంటె రణక్రియావిధుల్
సిద్ధముఁజేసి పెట్టెడి బ
లిష్టుడె బాధ్యతలన్ని మోయగా
బద్ధుఁడు గావలెంజుమి; చి
వాట్లకు, పాట్లకున్నైచి, యీాయ్యసం
బద్ధపుఁగొల్పులో నిదురఁ
బట్టకయుంటినె మాటలేటికే ?

అదియునుగాక,

అడవులగుండె యుద్ధశిబి
రాములకొల్లున, వట్టిమాటతో
గూడిన దేమిగాదది; స
ఖుల్ రసికుల్ కదుపోయిగా జల
క్రీడలొనర్చు మంజుల ప
రీమళప్రేమసరస్సుగాదు; నీ
తోడు సఖీ! మఱిచ్చట గ
తుల్ విధికైనను లేవు తర్లుమీ.

ద్రౌప:—స్వామీ! మీరెంత యుద్ధవీరాగ్రేసరులో, ఎంతటి అజాత శత్రువులో గాని మీమాటలుమట్టుకిప్పుడు సహించలేని కత్తి పోటులుగా మారినవి.

ఐనవి యాయువారములు
నైనవి భూప్రజలెల్ల మెచ్చగా
బూనిన రాయబారములు
బోలెడుచేసిన వీరజాతిపం
చానన శౌర్యసాహస ప్ర
చండ ప్రతిజ్ఞలుగూడ నేటితో
నైనవి; పోరులో జయము
లైనవి ధర్మజ! విశ్రమించుడీ!

ధ.—పడతీ! ఇకచాలు నీ యధికప్రసంగములు—

దెప్పాటకిట్లు నీవరుగు
దెంచితతే! మునుముందు నింక నే
త్రిప్పలు వచ్చిపడ్డను స
ఠే సహింతునుగాని, ఆడపో
రెప్పుడు సైపలేను సుద
తీ! వినుమీ- రగిలించబోకుమీ
నిప్పులగుండముల్; తరలు
నీవిక గండముదప్పి భామినీ!

అటు సంగ్రామధరాపురంధ్రి కనలె
త్తై నిప్పుకల్ గ్రక్క, ది
క్తటముల్ బ్రద్దలుగొట్టుచుండె నిటు సౌ
ఖ్యశ్రీకళారామ ది
క్తటినీ కోమలి హోరోరునన్ చెవులు బ్ర
ద్దల్గొట్ట సాధ్వీ! మఱి
చ్చట నీముచ్చట నచ్చదే, కుఱచబా
సల్ గ్రుచ్చి నొచ్చింపకే.

(అదుర్దాగా లేచి ద్రౌపది రెండుచేతులు పట్టుకొని సాగనంపబోతూ

తర్లుము తర్లుతర్లుమిక
తర్లుము నేనికసైప; రాజకిం
కర్లు మఱింకవచ్చి పెను
కార్పులుతై శిబిరమ్ముసొచ్చి సం

కర్ణను జేతురేమొ; నఱ
కమ్మ్రటుపైన తరించలేవు; శం
కర్లు త్రిశూలమెత్తినను
గాచుట కష్టము తర్లు మానినీ!

ద్రౌప:—(చికాకుతో మొహం చిట్లించుకొని, చేతులు విదళించుకొని)

ఎక్కడజాతశత్రువు; మ
ఱెక్కడ క్షత్రియజాతి రోషముల్
లెక్కకురాని యీాబిరుదు
లే మును కొంపలుముంచె; మీా యశం
బెక్కడ సన్నగిల్లి మఱి
యే నడియేట బుడుంగుమన్నదో
బిక్కమొగాలతో భరత
వీరులమంచు వచించబోకుడీ!

(తటాలున నిష్క్రమించును)

గృః—ఔరా! కడకు మాబ్రతుకు ఆడవారిముంగట ఎంతపరిహాసపా
త్రమై అపహాస్యములపాలై పోయినది. ఇంతకూ మేము మున్ను
జేసిన ప్రతిజ్ఞలు చెల్లించకపోబట్టిగదా నేఁడిటువంటి పరుషవాక్య
ములకు పడియుండవలసివచ్చినది. కటకటా! ఇంత కర్ణశూలా
యమానములైన పరుషవాక్కులుపడి సహించుటకంటె ఇక
యుద్ధభూమిలో తలబ్రద్దలై చచ్చుటే మేలు.

(తెర పడును)

# యుద్ధ ఖాండం.

## ద్వితీయాంకము

### కృష్ణార్జునుల ప్రవేశం

కృష్ణ:—(అర్జునునిచేయిపట్టుకొని) ఏమిటి ఫల్గునా! కురుసైన్యంబులను జూచి ఆశ్చర్యపడుచున్నట్లున్నావు.

అదిగో! నీపన్నైన యమ్ములకు సై
న్యాధ్యక్షునిం జేరి య
ల్లదిగో వెన్నునుఁ జూపి, గోష్పలకళా
హాస్యాలపై కత్తి, పెఁ
రొందిత్తో కౌరవసేన మొత్తుకొని, సి
న్నుంజూపి, యీ క్రీడితో
కదనంబుఁ బోనరింపలేవను సుమల్
కన్పట్టవే పార్థివా!

అర్జు:—బావా! వాసుదేవా! నీసముత్సాహము శ్లాఘనీయమైనగాని యింతకుముందు నీవువచించినట్లుగా కౌరవులు బెదరుపోవలుగారు. ప్రస్తుతం విశ్రాంతికోసం మనపాండిరి ఆకౌరవయోధులుగూడా తచ్చమూపతితో బాటు యుద్ధశిబిరమునకు పోవుచుండిరి.

భారతభూమిపై పిరికి
వారెవరింక జనింపలేదు; త
త్కౌరవనాథుఁడంత
తలకాయ మతేమియు లేనివాడుగా

దోరిపుసూదనా! మనకు
శౌందర దేనికి? దూరబోవుచు
న్నారు రథమ్ముపై మన ర
ణప్రభ గాంచ కురుప్రభుల్ సుమీ.

కృష్ణ:—అర్జునా! ప్రచండ శత్రులోక బలప్రవాహమ్ముల కెదురీత గొట్ట గల నీవంటి జగాజెట్టి పుట్టలేదు - పుట్టుటలేదు - మునుముందు పుట్టడు గూడా.

నీ కోదండ గుణధ్వనుల్ రిపుల గుం
డెల్ బ్రద్దలై పోవ న
ల్లీ కల్లోలము లేపివైచితివి; నేఁ
డీ యుద్ధరంగాన ప
రీ కాలద్రివ్వెడివారు నీపయి కిరీ
టీ! నీదు పేర్విన్నచో
తోకల్ముడ్చి రిపుల్ పలాయనపుమం
త్రోచ్చారణల్ సేయరే!

అర్జు:—బావా! కేశవా!

సాధ్యముకాని యింత కురు
సైన్యసమూహముమధ్య నీదు సా
రథ్యము లేక పోయిన ప
రాక్రమమెల్ల పరాభవాగ్నిసా
న్నిధ్యములోఁబడన్ నను గ
ణించక ధర్మజుఁ డుగ్రుడౌను; నీ
బాధ్యత నీవుమోసి రణ
వార్ధితరింపగఁజేయు మచ్యుతా!

కృష్ణ:—ఫల్గునా! నీకు నేనులేనిదే జరుగదు. నాకు నీవులేనిదే జరుగదు. మనమిరువురము నరనారాయణులమై దుష్టసంహార క్రియాశూరులమై ధర్మసంస్థాపన జేయుటకుగాను నేఁడీ వీరభారత కురుపాండవ యుద్ధమునకు వచ్చినమాట మరచిపోకుము.

భారతక్షేత్ర సంగ్రహవాంఛ జేసి
కౌరవకులంబు సకలంబు కాలిపోను
సందియములేదు ధర్మంబు సచ్చిపోదు
పార్థసారధి కిల తలవంపు రాదు.

కనుక నీవు త్వరితముగా ధర్మజుడున్న యుద్ధశిబిరమునకుబోయి ఇంతవరకు జరిగినయుద్ధపరిస్థితి ప్రోత్సాహజనకముగా తెలిపి మీఅగ్రజుని ఆశీర్వచనభాగ్యము పొందిరమ్ము నేనంతలో యుద్ధభవితవ్యముగురించి సమాలోచించి యీపూట మనరధము నెటుమరల్చి శత్రుసైన్యమును దునుమాడి భీష్మాచార్యుని జయించవలెనో నేనాలోచించుచుందును. నీవుమాత్రము త్వరగా రావలయునుసుమా!

అర్జు:—అట్లాగే వెళ్ళివచ్చెదను బావా! (ఇద్దఱు నిష్క్రమింతురు)

(తెరపడును)

2 వ రంగం.

యు ద్ధ శి బి రం.

(ధర్మరాజు ప్రవేశం)

ధర్మ:— అకటకటా! ఈ పాండవేయుల పరిభవాగ్ని చల్లారెడి చల్లని కాల మింకను రాలేదు గాబోలు. మావెంట చక్రాయుధుడున్నను నేడు మా దురదృష్టకాలమై పరీక్షమునకుగదా పౌరుషహీనులమాదిరి మగువలచేత మాటలుబడి బ్రతికి యుండవలె!

వచ్చినది. ఫల్గునా! నీగాండీవమునకు గుండె చెడెనా? నీ పాశు పతాస్త్రమునకు చూపుతగ్గెనా? ఇంత ముసలివగ్గుతో నీవింకె న్నాళ్ళు పోరాడెదవయ్యా? త్రిజగన్మోహనా! నీత్రిమూర్తుల దివ్యకరుణాకటాక్షము మాకు కఱువాయెనా? ఇంకెన్నాళ్ళు ఇంత వీరభారతరణరంగంలో దారి తెన్ను తెలియకుండా కొట్టు కోవలయునో తోచకుండావున్నది.

శరగురుండు మునుపందరికంటె మురిపాన
గఱపిన విలువిద్య మఱుగు పడెనో!
స్థాణుని మెప్పించి శౌర్యదర్పమున గై
కొనిన పాశుపతమ్ము తునిగి పడెనో!
వజ్రాయుధుఁడు పుత్రవాత్సల్యమున మున్ను
తనకిచ్చిన ధనస్సు తగులబడెనో!
పాండవేయుల పంచప్రాణమయిన చక్ర
ధారితో పడరాని పోరుపడెనో!

యేమి సంకటంబులు వచ్చి యీ కిరీటి
మూలనున్న ముదుసలితో పోరలేక
ఘోరపరిభవదావాగ్ని గుండమందు
కుమిలిపోయెనో నేఁడు మా కుంతి యేడ్వ!

అప్రతిహతమైన బలశౌర్యసాహసాలతో జగదేకవీరుఁడైన త్రివి క్రముడు సారథియైయున్నను మాకు జయలక్ష్మి సాక్షాత్కరిం చుటలేదు. ఇంకను యినుపగజ్జెలతల్లి మానెత్తిపై యున్నది గాబోలు! (ముందుకు జూచి) అవచ్చునది మాధనంజయుడేనా? జయసంరంభములతో వచ్చుచున్నట్లు కనుపించుటలేదే! వెంట మా కృష్ణపరమాత్ముఁడేడి! ఇదంతయు పరికించిన యేదోమూడి

నట్లుగానే గోచరించుచున్నది. ఫల్గునా! ఫల్గునా! భీష్ముఁడు మడిసెనా? జయలక్ష్మి చేఁజిక్కెనా?

(అర్జునుడు ప్రవేశం)

అమ్మో! యుద్ధము వద్దు కౌరవులతో,
నద్దానితో నేఁడు లా
భమ్మేమాత్రము లేదు; నాశనములో
వంశమ్ములద్దానితో
అమ్మో! భీష్మ గురుల్ హిమాలయములై,
యచ్చోట నిల్చుండి సై
న్యమ్ముం యుద్ధధరాతలమ్ము వణకిం
చన్నొచ్చిరో ధర్మజా!

ధర్మ:—అనుకొనినట్లే యైనది.

ఏనవి మాప్రతిజ్ఞలు, మ
హారణసింహ పరాక్రమ క్రమా
లైనవి; ఇప్పుఁడన్న ద్రుప
దాత్మజ మాటలుగూడ సార్థకం
బైనవి; బొందిలో పరిభ
వాగ్నిరగుల్కొని జ్వాలలున్ తయా
రైనవి మాప్రసిద్ధ విజ
యధ్వజమిప్పుడు దగ్ధమాటకే!

అర్జు:—అగ్రజా! అహింసావజ్రకవచధారుఁడవైన నీవు అజాతశత్రు వనెడి బిరుదు నిలఁబెట్టుకొనుటకైనా యీ నిరర్థకయుద్ధపుత్రోవ త్రొక్కకుండా వారింపవైతివిగదా! పైగా వారింపకపోగా

మీరు మిక్కిలి బంధువినాశకరంబైన సమర ప్రయత్నములకే
వాడి గట్టితివా ?

పెంచిన యీ పితామహుని,
పేరిమితో నొడిఁజేర్చి విల్లు ప
ట్టించిన పూజ్యుడౌ గురుని
యేను వధింపగలేను; నారి సా
రించగ వారిపై కరము
లేమిటొ లేచుటలేదు, నాకు పా
లించుటకే ధరిత్రి వల
దింక శరమ్ము పరిగ్రహించుఁడీ !

అన్నా ! ధర్మజా !

తమ్ములతో, త్వదీయ భుజ
దర్పకళారణకౌశలమ్ముతో
నమ్ములు కట్టఁగట్టుకొని,
ఆహవభూమికి మీరలేగి, మీ
జొమ్మువిగింపుఁ జూపుచు వి
రోధి శిరోధి సమూహము ల్సమూ
లమ్ముగఁ ద్రుంచి నేఁడు జయ
లక్ష్మి గడించి ధరిత్రి నేలుఁడీ !

ధర్మ:—ఫల్గునా ! నీనోట నెన్నడూ వినరాని మాటలు వినవలసి వచ్చి
నవి. నీవు వెనుకటి భీభత్సుడవన్న పేరుతో లేవా ? నేఁడు
శరకౌశలుఁడవైన సవ్యసాచివి కావా ? నీకీ వైరాగ్యచింత
యెట్లు పట్టినది ?

వినేన్నీ నమ్మి రణమ్మునలో నడుగు తం
ఁడ్రీ! పెట్టితింగాని, యే
మన్ననీవిక సైతు; నన్ను, నలభీ
మన్నర్ రిపులైకి పా
మ్మన్నర్ సైపనునేమి? మాకు మఱి యే
యార్తావనుం డెప్పుఁడా
పన్నుండై వరముల్, ప్రశస్తశరముల్
బాబో! ప్రసాదించె నే?

అర్జ:—

అన్నా! ధర్మజ! యేది యెట్లయిన నే
నాలమ్ము సేఁబోను; వి
చ్ఛిన్నంబై ప్రజమచ్ఛరమ్మున శిర
చ్ఛేదమ్ములై ధ్రెళ్ళగా
నెన్నోకొండలు గుండెలో కరగిపో
యెన్నాళు; నేఁడింక సం
పన్నాంధత్వముకింత హింసనొనరిం
పన్ లేను ధర్మప్రభూ!

(కృష్ణుండు ప్రవేశం)

కృష్ణ:—అదేమిటి ధనంజయా! యుద్ధపువేళ మరచిపోయినావా యేమి?

ధర్మ:—కృష్ణా! మా ధనంజయుడు యుద్ధపువేళేగాదు మరచినది యుద్ధ నీతిగూడా మరచినట్లున్నది.

కృష్ణ:—అదేమిటి బావా?

ధర్మ:—ఇంకా అదేమిటీ - ఇదేమిటి!

హింసను సేయనోపఁడట!
ఇయ్యది పాపము సర్వవంశ వి
ధ్వంస వినాశ హేతువట!
తద్రణ మింతకు ముందుఁ జేసి యీ
మాంసకుఁడై యహింసలకు
మార్గము వేసెడి దీనబంధుఁడై
సంసరణాబ్ధి దాటుటకు
చక్కని ద్రోవనుదీసె నచ్యుతా!

కృష్ణ:—బావా! పార్థివా!
మోరకులైన కౌరవుల
ముందిది యేమిటి? సిగ్గుబాటు కా
దే! రిపులిద్ది విన్నను మ
ఱెక్కడ ఫక్కున నవ్వి మిమ్ము నూ
రూరను గేలిఁ జేసి పరు
వుండగనిత్తురే? ఇద్ది మెత్తురే?
జారుటిదేమి యీ భరత
సంతతి కీరితి మాయ ఫల్గునా?

అక్షయపాత్ర వట్టెడి మ
హాత్ములతో జత సేతువేమి? ఫా
లాక్షుని నిల్వరించి విజ
యధ్వజమెత్తిన శౌర్యధైర్యహా
ర్యక్షుఁడ వీవు; దేనికి భ
యం బిపుడొంటను నావహించి రు
ద్రాక్షలు దాల్చబోతి శప
థమ్మును దప్పుచు పాండునందనా!

అర్జు:—కృష్ణా! జగత్స్వరూపుఁడవైన నీకొరులు చెప్పవలసిన దేము న్నది. ఈ యశాశ్వతమైన అల్పరాజ్యలక్ష్మివై భవశ్రీకొరకు యేమీయెఱుఁగని నిరపరాధులను, బంధుమిత్ర సుహృజ్జననివ హంబులను దునుమాడలేను. రోషావేశంబులు తూర్పారఁబట్ట లేను.

ఎవరేమన్న మఱెవ్వరెంతటి హితం
బెక్కించినన్ గూడ నా
చెవులం దూరవు; వీరభారతయశ
శ్శ్రీ నన్ను, నా మోముఁ జూ
చి విరాజిల్లక పోయినన్ సరె;
రిపుల్ ఛీ! యంచు సిగ్గిల్లఁ దీ
సి వికారంబుగఁ జేసినన్ రణపు కా
ర్చిచ్చింక రేగించనే!

ధర్మ:—కృష్ణా! నందనందనా! వింటివా విప్వచ్ఛుని వేదాంతములు. ఇంకా నీవూ నేనూ యుద్ధసిద్ధాంతములు మఱెవ్వరికైనా చెప్పి జూచిన ప్రయోజనముండును.

కవ్వించంగ నెడందలో బిగువుచే
కన్ మెత్తగా మెత్తగా
విప్వచ్ఛుం డిల చచ్చు పుచ్చుగల యీ
వేదాంతము ల్విప్పుచున్
గువ్వల్మధ్యను గవ్వలాడుట కిటుల్
కూర్చుండె; పేర్వాసి యే
నవ్వు ల్పాలయినన్ సరే యతనికే
నష్టంబు లే దచ్యుతా!

కృష్ణ—అర్జునా ! స్వధర్మకార్యవర్జితులైనవారికి మఱెట్టి సౌఖ్యంబులు సిద్ధించ నేరవు. నీవు ఉత్తమక్షత్రియవంశ సంభూతుఁడవు.

పేరిమి రాచబిడ్డలకు
వీరరసైక విశాలవిశ్వశౄం
గార గుణమ్ము లందములు
గాని, ధరామరవంశవైదికా
చారము లేమి యందములు
చందము లెన్నఁడుగావు; క్షత్రియా
చారము కత్తిఁగట్టి రిపు
సంఘము చెండుట; లెమ్ము ఫల్గునా !

యదియునుఁగాక, విశాలవిశ్వంభరాస్థలిపైన,

జీవులు పుట్టిగిట్టుట, వి
చిత్రపుటందపు జన్మలెత్తి, ల
క్ష్మీవిభవమ్ముతో, కటిక
చీకటి కూకటి వేళ్ళతో మఱే
దేవుని గారడీ పనిసి
తేలినవో వివరించలేని యీ
భావము నొక్కటే నిఖిల
బాధ్యతలెల్ల వహించు నర్జునా !

ఇదిగో ! నీవు నీ రణవిద్యాపాటవము, నీ యసమానధనుర్విద్యా కౌశలమ్ము మరచిపోయి వట్టి పనికిమాలిన మెట్ట వేదాంతములలో పడితివేమో ఫల్గునా ! ఇది నీకూ, నీ రాచవంగడమునకు తెచ్చి పెట్టెడి ఘనమైన ప్రతిష్ట యినుమంతయు లేదనుమా !

నీ విల్లెన్ని గుణధ్వనుల్ విసరునో!
నీగాండీవం బెంత రా
జీవాత్మున్ మురిపించి శాత్రవ శిర
చ్ఛేదమ్ము గావించునో!
నీ వైదుష్యము లెట్టివో యని సురల్
నిశ్చేష్టులై యుండగా
నీ విల్లెత్తిన బావ! ఇంక మనకున్
నిల్వం గతు ల్గల్గునే?

అర్జు:—కృష్ణా! గోపకులైక శిరోవిభూషణా!
ఈ రణపాటవంబు, మఱి
యీ శరకౌశలడిండిమంబు బం
గారపుజాతి మంటనిడి
కాల్చుట కున్నతమైనవేమొ గా
నీ, రభసంబులేని రమ
ణీయ మహీవిభవంబు దివ్యసుం
దార వనమ్మొనర్చుటకు
నా కవిగూడ దనుగ్రహించుడీ.

ధర్మ:—బావా! వాసుదేవా!
మతిచెడినట్టులున్నది;
సమస్తమెరింగిన నిన్ను, నీజగ
స్థితి గురుతించ కించుకయుఁ
జేలిచివైచె తృణమ్ముగా; పరి
స్థితి పరికించిచూచిన మ
దీయ కుటుంబములోన నీడునే

దు తెగులుగా తయారయిన
టుల్ విశదంబయిపోయె నక్కటా!

నాయనా! తమ్ముడా! నీవనినట్లు యుద్ధవృత్తోవ నరకలోకానికే త్రోవయగును.

కడుమేలైన నుడుల్ వచించితివిరా
గాండీవి! పాపమ్ము నీ
మెడకుం గట్టిన యుద్ధఘట్టములికే
మీ లాగవద్దోయి; కా
అడవుల్ పట్టుచు గాండివమ్మునను నా
యా చెట్టుకాయల్ మఱి
య్యాడ రాల్కొట్టి భుజించు; వైరి తలకా
యల్ కొట్ట దోషంబురా!

కృష్ణ:—ధనంజయా! ఈ యకారణభయసంతాపములు నీకెక్కడ నుండి వచ్చినవయ్యా?

మును దుర్యోధనుఁ డెన్నికష్టములు మి
మ్ముం పెట్టెనో కొంచెమై
నను నీకుం గురుతింక లేదె? నను వె
న్కం గ్రుడ్డి దర్బారులో
ఘనుఁడై పైఁబడి కట్టఁజూడ మరువం
గానౌనె? మీ కన్నత
ల్లిని పార్థ! పైరపంచ దుర్విధిని కూ
లించం వివేకంబకో?

అర్జ:—కృష్ణా! శూరకులైక శిరోవిభూషణా! సర్వమెఱిఁగిన నీకు

నేను చెప్పవలసినదేమున్నది. జగచ్ఛ్రేయ వినాశకరంబైన యీ
కార్చిచ్చువంటి కచ్చెను నే నోడిఁగట్టలేను జబ్బలు తట్టలేను.

కార్యాకార్య విమూఢచిత్తమున మ
ద్గాండీవ మింకెత్తి, యా
చార్యుం నాదు పితామహుం, ఘన కృపా
చార్యుం పసంగొట్టి, నేఁ
డార్యాచారము మంటఁబెట్టిన, మహా
త్మా ! మాకు దిక్కేది ? మా
శౌర్యశ్రీ కుఱచైన, సౌఖ్యమగు బి
చ్చంబెత్తి జీవింతుమే !

ధర్మ:—విననొల్లని చెవికి యెన్ని వేసినను రుచింపవు.

వట్టి వివాదమేల ? యదు
వంశవిభూషణ ! పోరున న్జగా
జెట్టయినట్టి కర్ణుని య
శేష పరాక్రమ శౌర్యవహ్నిలోఁ
జిట్టెముఁగట్టె మా నరుని
చేవ యభేద్యకిరీటమింక తా
కట్టిడి కౌరవేంద్రుకడ
కాలముఁ బుచ్చును పాదుపట్టకై.

కృష్ణ:—ధర్మజాగ్రణీ! మా విశ్వవిఖ్యాతిగల విజయుడు విజయంచేసి
వీరవిజయభేరీ మ్రోగించును. ధర్మనందనా ! నీ వన్నట్లన్నటికిని
పిరికిమానిసిగాడు. ఏదో గురువుగారి మీదవున్న భక్తితోనూ,
పితామహుఁడైన భీష్మునిపైగల పూజ్యభావముతోనూ, తాని

ప్పుడుయుద్ధముఁ జేయుట కిట్లు శంకించుచున్నాడే గాని పదు నాల్గు భువనాలెత్తుకొని ఫాలాక్షుఁడు దండెత్తి వచ్చినను, ఈ నీచదుర్యోధనాదులనూ, యీ దుష్టదుశ్శాసన దుర్మార్గులనూ వధించని దేమట్టును వదలిపెట్టను, పాండవాగ్రజా ! యీ ఫల్గును నకు నీకంటే యిలువేల్పులు మఱొకరులేరు. తప్పక నీయానతి శిరసావహించగలడు మీవెంట రాగలడు. తక్షణమే నీవు నిర్ణ యించినట్లు నడువగలడు.

బావా ! పార్థివా ! ఈ యుద్ధఘట్టమంతయు నా సంకల్పమాత్రము వల్లనే నడచును. మీరందరూ నామమాత్రముగానే నిలువబడుట. నిలి పించిననూ, గెలిపించిననూ నేనే అయియున్నాను. ఈ హింసాహింసాకాం డములన్నియూ నేనొక్కడనే జరిపినది. జరిపించుచున్నది. జరుపఁబోవు చున్నది. బాధ్యత నాది. భారము నాది. మోసెడువాఁడనూ, రోసెడు వాఁడనూ నేనే. ఇంకా నీమీదయేమో యున్నదని శంకించవలదు. చింతిం చవలదు. అర్జునా ! అసలు, భీష్ముఁడు మడియుటకు సుళువైన మార్గ ము గలదు. వెనుక తానిచ్చిన మాటచొప్పున శిఖండి యనువాఁడెదుట పడినప్పుడు తానెంత రణరంగమధ్యముననైననూ అస్త్రసన్యాసము చేసి తీరును. కనుక మునుముందు శిఖండిని, ధర్మరాజా ! భీష్ముని యెదుట పడునట్లు చేయవలెను. పంపవలెను.

దండిగ పాండవేయులకు
ధర్మబలమ్ము; సమస్త శత్రువే
దండ మదోగ్రకుంభము వి
దళ్చెడి యీ హరి విక్రమమ్ము బ్ర
హ్మాండముగా మఱుండె; రిపు
మండలిలో విజయుండ వీవుగా
కుండెనె యింక పార్థ ! నిను
యుద్ధ జయేందిర పిల్చుచుండెరా !

అర్జు:—ధన్యుఁడను- ధన్యుఁడను.

తరియించెం మఱి నాదుజన్మ మిక యు
ద్ధక్షోణిపై కృష్ణ ! యీ
యరదంబుల్ ద్విరదంబు లెల్ల భవదీ
య శ్రీమహాశక్తితోఁ
దొరలింతుం; వినువీధి గుంపులు విరుల్
దోసిళ్ళతోఁ జల్లఁ నీ
నరనారాయణు లొక్కటైరి; జయము
న్నా ! ధర్మపక్షానిదే.

ధర్మ:—మహానుభావా ! వాసుదేవా ! నీ చక్రమున కెదురేమున్నది.

చతురంభోధిపరీతవిశ్రుతధరా
శౌర్యస్థిరాచార్య స
న్నుతసంపద్విభవై కరంజితపదా !
నూత్నప్రయత్న ప్రదా !
ధృతరాష్ట్రాత్మజులైన వారలకు త్వ
ద్దేదీప్యమానమ్ములై
న తటిచ్చక్రధళద్ధళల్ ఘనకిళల్
నచ్చుం కనుల్ లేవుగా.

కృష్ణా ! నీ దర్శనము. నీ సుదర్శనము త్రిభువనభాగ్యనిదర్శనము. నీజగదేకవీరసాహసపరాక్రమము త్రివిక్రమా ! మా రథసారథ్యముసేయు చున్ననూ, నీ సులలితసుకుమారసుందరమందారమకరందమాధుర్యమం జులవాగ్విలాసములు మాధవ ! మా నరజన్మకర్మకారాగారములలోఁ చిక్కుచీకట్లను పటాపంచలు సేయుచున్ననూ కేశవ ! మే మప్పుడ ప్పుడు పెడదారినిఁ బడిపోవుచుండెడి మూఢనరుల మని నీకు తెలిసియే

యున్నదిగదా ! మా వీరభారత కుటుంబములోన పరస్పరకలహకారణములు పుట్టకుండునట్లు కాపాడి, ఈ ప్రపంచవినాశకరంబైన యీ యుద్ధఘట్టమునుండి త్వరగా మా రథములు మా మనోరథములు దరిజేర్చుటకు నీ ధర్మరాజు నిన్ను వేడుకొని సమర్పించుకొన్న నతులు మఱువకుము. (అందఱూ నిష్క్రమింతురు)

(తెర పడును.)

# యుద్ధ భూమి.

## తృతీయాంకం.

### 1 వ రంగం.

### కురురాజ యుద్ధశిబిరం.

(దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని, కర్ణుఁడు ప్రవేశింతురు)

దుర్యో:—మామా! శకుని సునామధేయా! మీరెన్ని ధైర్యవచనములు శౌర్యసాహసవిక్రమములు విన్నవించుచున్ననూ నా మనస్సుదేమిటో కుదుటఁబడుట లేదు. భీష్మునివంటి నిర్వక్రబలపరాక్రమసింహుఁడు అఖండధనుర్విద్యాసముద్రుఁడు మన సైన్యవాహినిలో మఱెక్కడా కనిపించుట లేదు.

మేదిని మీఁద భీష్మునికి
మించిన వీరుఁడు పుట్టలేదు; శౌ
ర్యాదులు, సాహసాదులు, మ
హారణరంగధనుర్బలాది వి
ద్యాదులు తన్నుదీసుతుని
యద్భుతజీవితగాధలో చతు
ర్వేదములౌచు నేఁ డతని
వీరసమాధికి శయ్య లయ్యెగా.

శకుని:—నాయనా! సుయోధనా! నీ వన్నది వాస్తవమే. అతని ప్రతిజ్ఞ, అతని స్థితప్రజ్ఞ చతుర్భువనవాసులకు ధర్మభిక్ష పెట్టినది.

దుశ్శా:—మామా! మాకు మీ రెల్లరు వంతపాటకు పనికివచ్చుచుందురే గాని అవసరముపట్ల అక్కరకువచ్చువారు కాకపోయిరి గదా!

అనుటకు నిందుచుండి రిక
దేవిడి లేవిడి గాగ; నేటి కొ
క్కనికిని యుద్ధరంగమున
కాలిడి కవ్వడిముందు నిల్చి భం
డన మొనరించు గుండెలు క
నంబడకుండెను; దేనికీవు మా
వెనుకను వంతపాట విని
పించుట మామా! వృధాప్రయాసతో.

శకుని:—నాయనా! దుశ్శాసనా! నీవు చెప్పినదంతయూ వాస్తవమే!

మనలో భీష్ముని స్థాన మెవ్వఁడిక సా
మర్ధ్యమ్ముతో నేడు గై
కొని యీ కౌరవవీరపౌరుషము దూ
కుల్పోటగా జేయునో
కనలేకుంటిమి; వట్టి బింకములతో
కవ్వించి విన్వచ్చునిన్
మొనగాడెవ్వఁడు గెల్వ లేడని ని
లింపు ల్గుంపు లీక్షింపరే?

కర్ణ:—బాగు బాగు. అసలు మన కౌరవేశ్వరుని హృదయసంతాపమేమిటో మీరు గుర్తించనేరక వట్టి యసందర్భప్రసంగాలతో వృధాకాలక్షేపాలు జేయుట మనవంటి వీరభారతయోధులకు

తగిన పనికాదు. ఈ సుయోధనమహారాజు తన కురువంశపితామహుడైన భీష్మునిగురించి లేచిన హృదయపరితాపమును, విలాపమును వెలిబుచ్చెనే గాని యెక్కడో పడివున్న పార్థుని ప్రతాపపౌరుషాలు, ప్రచండవిక్రమాలు అసందర్భంగా మతేమీ ప్రశంసించుట లేదు. అదియునుఁగాక,

అర్జను పౌరుషంబును, మ
హారణకౌశలముం మతెక్కడో
నిర్జరు లెల్ల మెచ్చుకొన
నీ; కురురాజది లెక్కఁబెట్టునే?
కర్జము వీడి భూధవుఁడు
గాని శిఖండిని జూపి మా ధను
ర్వర్జితుఁడైన భీష్మువయి
పడ్డ నృపాధము నింక సైతుమే?

అంతేగాక,

శతవృద్ధుం ముదివగ్గుం గెలువగా చక్రాయుధుం డేమిటో
చతురత్వంబున దూకఁబోయి పయి వాచాడంబరానం తిరో
గతుఁడైనప్పుడు నేఁడు మా పడుచువిల్కాం డ్రౌర! డీకొన్న నే
గతి కృష్ణార్జును లింక చూడగలరో కన్పట్టి మాట్లాడుమీ.

దుర్యో:—మామా! నేనిప్పుడు అర్జునునితో సరిపోగల వీరాగ్రేసరుఁడు మన కౌరవసైన్యవాహినిలో లేడేమో నని విచారించుట లేదు. అట్టి విచారం నాకెన్నటికిని కలుగదు. ప్రస్తుతము మన కురుసేనానాయకుఁడైన భీష్మాచార్యుని స్థానములో యెవరిని నిర్ణయించవలెనో మనస్సునకు తట్టుటలేదు.

(ద్రోణుఁడు ప్రవేశం)

ద్రోణు:—ఏమది కురురాజా! ఆలోచనానిమగ్నులై వున్నారు?

దుర్యో:—(లేచి) గురుపుంగవా! దయచేయుడు.

(ద్రోణుడు, దుర్యోధనాదులు కూర్చుందురు)

దుర్యో:—గురుదేవా! అసమానశరవిద్యాప్రపంచప్రతిభాప్రభావా!
మము గారాబముఁ జేసి పెంచుచు కురుక్ష్మామండలీ దివ్యభా
గ్యము లన్నింటిని మించు తావక ధనుఃకౌశల్యముల్ మీ కృపాం
కముపై నేర్పిన మా పితామహుఁడు ప్రక్కన్ లేక మాకింక మా
ర్గము లేనాఁ డిల దుర్గమాలయి గురూ! కవ్వించ లేకుంటిమే!

కర్ణు:—మిత్రమా! సుయోధన సార్వభౌమా!
పోయిన యీ నదీసుతుఁడు ముజ్జగముల్ కుదియించి శౌర్యధా
రేయులలోని పౌరుషధురీబలసాహసవిక్రమక్రమ
చ్ఛాయలు ధారవోసి తన జాతిని ఖ్యాతిగ నిల్పఁబెట్ట నీ
వీ యపకీర్తిమాట వచియించు టదేమిటి కౌరవేశ్వరా!

ద్రోణు:—సుయోధనా! కురువంశసద్యశోధనా!
అన్యవిచార మెందులకయా! రణనీతికి కర్ణుఁ డేమి సా
మాన్యుఁడె? వానితోడ కురుమండలిలో సరితూగువాఁడు మా
లిన్యములేని శౌర్యమున లేడుగదా యొకఁడైన; దేని కీ
దైన్యము నీకు? కర్ణుఁడు పితామహు భారము నిర్వహించుగా.

కర్ణు:—శస్త్రాచార్యా! ద్రోణాచార్యసునామధేయా! నే నింతకు ముందు మన యీ కౌరవేంద్రునకు చెప్పినదంతయూ నా బాహుబలపరాక్రమాదుల గుఱించి కాదు. మన సేనానాయకుఁడైన పితామహుఁడు తన వారిని తనంతటివారిగా జేసుకొనియే

యీ కురుక్షేత్రసంగ్రామమందు వీరస్వర్గమలంకరించ బోవు
చుండె నంటిని గాని వాని స్థానము నేను నిర్వహించగల నని
నేనేమియు చెప్పుట లేదు.

నీవు ధనుర్ధరుండవయి నిర్మలధర్మపరాయణుండవై
భావికథాపరిస్థితులుఁ బట్టి జయధ్వజ మెత్తు జోదువై
నావు; చమూసమూహము రణస్థలిపై భవదీయసాంజ్ఞతో
చేవనుఁ బట్టి యెవ్వరికి చిక్కని పిక్కబలాన పోరదే.

శకుని:—బుధజనవిధేయా ! రాధేయా ! నీవు చెప్పినదంతయూ కొంత
వరకు వాస్తవమే కావచ్చు.

క్షత్రియుఁడైనవాడు రణసంస్థకు నాయకుఁడైనవాఁడు గా
నీ, త్రిదశాలయేశులు గణించు బృహస్పతియైనఁగూడ యే
మాత్రము చెల్లనేరఁడు సుమీ; మఱి తద్రణనాయకత్వ మీ
పౌత్రుల కర్హమం చనెద; బ్రాహ్మణపుంగవు లిద్ది యొల్లరే.

ద్రోణు:—సుయోధనా ! ఎవరు దేని కర్హులో భావికాలభాగ్యోదయభా
నుఁడు విదితంబు సేయకమానడు. క్షత్రియాచారము నిర్వక్రబల
పరాక్రమ శౌర్యరససంచారమై ప్రచండశత్రులోకభయానక
సంగ్రామరంగనాయకత్వ మలంకరించవచ్చుగాక.

అందఱికంటె క్షత్రియుల కౌర ! మహాయశముండుగాక ! ఈ
జందెపుపోగువారు రణశౌర్య మెరుంగకపోవు గాక ! భా
మందులు మీరలన్నిటికి మాకిఁక శల్వ నొసంగి మీగజ
స్యందన సైన్యసాహస ప్రచండధనుర్బలశక్తిఁ జూపుడీ.

శకుని:—కురువంశ గురువరేణ్యా ! ఆర్తజనలోకశరణ్యా ! ఆహా ! మీ
రెంతలో ఆగ్రహపరవశులైనారు ! మీరిన్నాళ్ళనుంచియు మా

క్షత్రియులోక గౌరవాభిమానులుగా నుండిరని విశ్వసించుచు న్నాము. త్రిలోకవీరుఁడైన మా కురుకులపితామహుఁడు తన శౌర్యవిక్రమస్థానము మా కొప్పఁజెప్పుట మా శరగురువరేణ్యులైన మీరుగూడా సమ్మతింతురని భావించి గాంగేయుని సర్వసేనానాయకత్వము మా క్షత్రియులలో నొకరి కెవరికో యిప్పించుటకు కుతూహలపడినాము. ఇది మీ కిష్టము కానిచో మా కురుకులగురుపుంగవులైన మీమాట మే మెవరమూ జవదాటఁ జాలము.

ద్రోణు:—ఓయీ ధృతరాష్ట్రాత్మజమాతులా! కురువంశభావిభాగ్యకౌతూహలా! నీ రాజనీతి చాకచక్యము, నీ యసమానరాజకీయతౌక్ష్ణ్యము మే మెరుంగనిది కాదు.

నీమూలంబునఁగాదె యీ భరతమాణిక్యంబు లీనాఁడు సం
గ్రామాగ్ని ప్రళయంబులోన బడి సర్వధ్వంసమై పోవగా
నీమాట ల్జెవిఁబెట్టి నీవెరుక నీనిర్మాణ మార్గమ్ముపై
ఈమాడ్కి నడువంగఁ జొచ్చెనిక మేమిఁచ్చోట నెట్లుందు మే!

ఇంతవరకు జరిగిన కురుక్షేత్ర మహాసంగ్రామము, ముందుజరుగఁ బోయెడి విశ్వమహాజన వినాశనకరంబైన ప్రచండవీరభారత యుద్ధము నీచేతి చలువవలన నేయని జగచ్చరిత్రకారుఁడు స్పష్టము సేయక మానడు.

ఆలము నీకతాన బడబానలమై కురువంశవార్ధిలో
చాల తుపాను లేచినది; శౌర్యపయోధి పితామహుండు నీ
మూలముఁజేసి వాడిశరముల్వయి మేనును వాల్చినాఁడు; వే
యేలను యుద్ధనాయకుఁడ వీవె ధనుస్సు ధరించి నిల్వుమీ.

కర్ణుడు:—మహాత్మా! కుంభసంభవా!

వేసెడి ద్వేషరోషమున భీష్ముని స్థానముఁ గూర్చి యింత పో
టీపడనేల? ఇయ్యది కడింది మగంటిమితోడ శౌర్యమున్
జూపెడి క్షత్రియోత్తముని సొమ్మని యేము దలంచ మీరిదే
సైపరలే? క్షమించుడిక స్వామి! గ్రహించుడు నాయకత్వముల్.

దుశ్శా:—గురుపుంగవా! అంగరాజ్యపట్టాభిషిక్తుఁడైన కర్ణుడు ఉత్తమ క్షత్రియ ధర్మనిర్వహణ ధురీణుఁడైనప్పటికి పితామహుని స్థానమలంకరించుట కర్హుఁడైనప్పటికి శస్త్రాచార్యుఁడవైన నిన్ను వినమ్రతాభక్తివిశ్వాసాలతో విశ్వసించి విన్నవించిన విషయం సంస్తవనీయమైనదే గాని,

పిల్లలకు మీరు మీ శరవిద్య గఱపి
మీకు సరితూగువారిగా మెఱయజేసి
యుష్మదీయ పదవి నీయ నోపలేరె?
మెచ్చి నాయకత్వము నిచ్చి మేలుకొనరె!

దుర్యో:—తమ్ముఁడా! దుశ్శాసనా! మనమిప్పుడు శత్రులోకమును నిర్జించిమన పితామహుఁడైన భీష్ముడు నిలఁబెట్టిన యీ వీరభారత కురువంశకీర్తిపతాకమును కాపాడుకొనవలెనా లేక భీష్ముని నాయకస్థానంకోసం మనలో మనం మాటలుచెడి, వేరులుపడి, ఎవరికివారు చీలిపోయి కుల మత జాతి వర్గ పార్టీ పక్ష కక్ష భేదాలతో కొట్లాడి, పోట్లాడి ఈ విశాలవిశ్వభారత కురుక్షేత్ర మహాసంగ్రామ ప్రచండవహ్ని శతసహస్రయుగయుగాలవరకూ చల్లారకుండునట్లు రాజసతామసాలు, పదవీవ్యామోహాలు ముదిఱిపోయిన స్వార్థబుద్ధితో పనికిమాలిన లుబ్ధబుద్ధితో ప్రబలములు

చేసుకొనవలెనా ? ఏదియు నిర్ధారణ కానట్లు నాకు మన ధోరణి
కన్పించుచున్నది.

గురుదేవా ! భవదీయ శిష్యులకు దిక్కెల్ల మ్రొక్కు నీవైతి; యీ
కురుసంగ్రామ ధరాపురందర కళాకోటీర మాణిక్య ది
వ్యరథానీక గజాశ్వసైన్య నివహం బందింక నీకంటె నె
వ్వరు కవ్వించెడి శౌర్యధుర్యులు ధనుఃప్రావీణ్యవిద్యాధనుల్.

అదియునుగాక,

తూగుటకింక భీష్మునికి తుల్యుఁడు ద్రోణుఁడటంచు నేఁడు మా
ర్మ్రోగుటలేదె దిక్కులు; విరోధులగుండెకు గాలమై రణో
ద్యోగము సర్వమిప్పుడు యథోచితరీతిగ నీదు బాహువుల్
పైఁగలదయ్య; లెమ్ము జయలక్ష్మినిఁ దెమ్ము కురుప్రజాగురూ !

శకుని:—కురుకులగురుపుంగవా ! కుంభసంభవా ! మా అజ్ఞానకారణ
వాచాలత్వములు మన్నించి మా కురురాజు ప్రార్థించిన చొప్పు
న నింక నీవు కురుక్షేత్ర సంగ్రామరంగనాయకత్వము నంగీక
రించి భావికర్తవ్యము గుఱించి సెలవివ్వవలసినదని ప్రార్థించు
చున్నాము.

ద్రోణు:—కురుకులకీర్తిధనా ! సుయోధనా ! నేను భీష్మునంతటివాడను
గాను, నేనుకాదుగదా త్రిమూర్తులుగూడ సరిరారు. అయితే,
ప్రస్తుతము విచారింతము. యుద్ధశాస్త్రములలోకెల్ల మిన్నయై
యెన్నికగల వ్యూహమొకటి గలదు. అది పద్మవ్యూహమని
చెప్పబడును. దానిని రేపటి యుద్ధరంగమున పన్ని మనకు జయ
లక్ష్మి చిక్కునట్లు చేతును. మీరందఱూ దీనికి నేను చెప్పునట్లు
సన్నద్ధులు కావలయును. ఇందులో అందఱికంటే ముఖ్యుఁడు
సైంధవుఁడు రేపు అనివార్యరణశౌర్యధుర్యుఁడై ప్రకాశించును.

రేపటి దినమున అతనిని గెలుచుట త్రిమూర్తులకుఁగూడ సాధ్య పడదు. కనుక ఆ పరాక్రమసింధుఁడైన సైంధవుని రేపు పన్నెడి పద్మవ్యూహద్వారమందు ప్రధానయోధునిగా నియమించవలెను. రేపు మనకు తప్పక జయము సిద్ధించగలదు.

దుర్యో:—ధన్యులము. ధన్యులము.

ఆ చక్రాయుధుఁ డొక్కఁడీ భువనశౌర్యాంభోధియై దూకి మా
భూచక్రంబును గిర్గిరా గిరగిరా మున్నీటిలోఁ ద్రిప్పి యెం
తో చీకాకుగ ముంచవచ్చిన మటీ దుర్యోధనుండింక ద్రో
ణాచార్యా! భవదీయదివ్యకరుణా వ్యాలోలుఁడై నిల్వడే !

గురువరా ! యుద్ధరంగమందు మా పితామహుని కపటోపాయంబున పడగొట్టించి జయసంభ్రమములతో పొంగిపోవుచున్నట్టి యా ధర్మరాజు గర్వమణగించి నాకుఁ బట్టియిచ్చిన చాలు. జూదరియైన యీ ధర్మజుని మరల జూదములోనికి దింపి, తిరిగి కాఱడవుల పట్టించి ప్రజలకు యుద్ధభయము లేకుండ జేసుకొందును.

ద్రోణు:—జయలక్ష్మీతపోధనా! కురుక్షేత్రసంగ్రామ సుయోధనా !

నీకుగల్గిన పెద్దలోటుఁ దీర్తును. ధైర్యము కుదుటఁబట్టుము.

నాల్గుపయోధులై దుముకు నల్గురి తమ్ములమధ్య నెంతయో
నీల్గుచు నిక్కుచున్న మహనీయుని ధర్మజు నింకఁ బట్టి, యా
ఫల్గును లెందఱడ్డ పడియుఁబడ్డను దెత్తు; త్రివిక్రముండు పె
ల్లల్గి సుదర్శనమ్ము విలయమ్ముగ త్రిప్పినఁగూడ వీడనే !

(అందఱూ నిష్క్రమింతురు)

తెర పడును.

## తృతీయాంకం.

### 2 వ రంగం.

### అంతఃపుర శిబిరం

ఉత్తర ప్రవేశం

ఉత్తర:—(నలువైపుల గోడలమీద కొట్టబడివున్న చిత్రపటములవంక జూచుచు)

నూరుయుగాలగజ్జనని నోచిన నోములతోటలో నలం
కారిణులైన యీ శుకపికస్వరకోటి సుఖప్రపంచ శృం
గారవిపంచికా మధురగాన సుధారసరాగమెల్ల నీ
వీరకుమారశౌర్య పృథివీపరమేశ్వరు లింపులొంచెనా!

ఈ అతిసుకుమారులైన రాచపుత్రుల చక్కదనాలు యీ జగద్శిల్పి చిత్రశాలలో జీవములు పోయుచున్నట్లున్నవి.

మున్నేయప్సరసల్ బల్లుసగుసల్ ప్రోగై మహోద్యాన సం
పన్నాఖండల రమ్యహర్మ్యమున ఈ బంగారు చిత్రాలు మేల్
చిన్నెల్వన్నెలు చిల్కు కేల్కులుకుతో చిత్రించెనో గాని గై
కొన్నారీ జగదేకవీరనృపదక్షుల్ కీర్తిసౌందర్యముల్.

(అభిమన్యుఁడు మెల్లగా వెనుకనుంచివచ్చి)

అభి:—అర్హతయున్నదా?

ఉత్తర:—(ఉలిక్కిపడును)

అభి:—(నవ్వి) ప్రశంసించువారికి భయభ్రాంతులేల?

ఉత్త:—ఎదుట పడనంతవరకు ఎవరైనా....

అభి:—(నవ్వి) ఏమిటి ఎవరైనా?

ఉత్త:—భయభ్రాంతులు కావలసినదే!

అభి:—ఐతే నీకిప్పుడు భయభ్రాంతి వదలినట్లేనా? ప్రేయసీ!

ఉత్త:—ప్రాణేశ్వరా! మీరే ప్రత్యక్షమైనప్పుడు నాకింకా భయభ్రాంతి యెక్కడిది!

అభి:— (నవ్వి) ఇంత అబలవి యెంతలో ఎంత బలిష్ఠురాలవైతివి, కుసుమకోమల గాత్రీ!

అదిగో కోమలి! జోడు పిట్టకయి నిద్రాహారముల్ మాని య
ల్లదిగో పాపము గువ్వ యేవిధముగా నల్లాడి శుష్కించుచు
న్నదియో; చీమ చిటుకుమన్న నిక ప్రాణాలెక్కడో వచ్చిన
ట్లది కంపించెడు; గుండె కోయబడు నేడా తీపి యేవాడిదో!

ఉత్త:—హృదయేశ్వరా! నిన్ను విడిచిపుచ్చి నేడొక నిముసమైననూ గడుపలేను. బ్రతుకలేను. పైగా యీ లేమావిగున్నపైన ఆ మాలతీలతాంగి పెనవేసుకొని దేనికో.

కిసలయపాణియై, కిన్నెరసాని యొయ్యారిభామయై
ముసిముసి మొల్కనవ్వు లెగఁబోసెడి యీ మృదువల్లికా లలా
మ సరసమెంతయో కరగి మండెడి వేసవిగాడ్పులో సుధా
రస మొలికించు కోయిలయి రాగముతో తెగఁగోసె ప్రాణముల్.

అభి:—జీవితేశ్వరీ! ఈ రాచవంగడములో పుట్టిన రాచబిడ్డలు శౌర్య కథాకలాపములతో ప్రొద్దుబుచ్చుచుండెడివారుగాని కేవలము మీవంటి రాజశుద్ధాంతస్త్రీల చెంత కాలక్షేపముఁ జేసెడివారు కారు.

కులికెడి చూపుతో కుసుమకోమలి మేదిని కోటిస్వర్గముల్
మొలుచు ధళద్ధళల్ చెదిరిపోసెడి వేళను స్త్రీలకింక దో
యిలియిడి పాదదాసులయి యీమగవారు మదీయ దివ్యమం
జుల శతపత్రసుందరి! పనుల్ తలక్రిందయి పోరటే వృథా.

(తెరలో మిత్రుడు పిలచును: అభిమన్యుకుమారా !)

అభి:—అదిగో ! నా చెలికాండ్రు కాంబోలు పిలుచు చున్నాడు.

ఉత్త:—ఈ పిలుపులకేమి ఎప్పుడూ యున్నవే !

అభి:—ఈ వలపులెప్పుడూ ఉన్నవేగా ప్రేయసీ !

ఉత్త:—ప్రియమనోహరా ! వలపులోఁగల తీపి యీ వట్టిపిలుపులలో ఎక్కడిది ?

ఈ జగదేకవీరులయి యీ కురుపాండవ యుద్ధభూమిపై
నీ జనకుల్ జయించి కడు నేర్పునఁ దెచ్చు సమస్తరాజ్య నీ
రాజన భాగ్య సౌఖ్య మృదురాగ సకేతన వైభవంబు కం
టే, జగమందు నీ హృదయ నీరజమొక్కటె నాకు మక్కువో.

(తెరలో మిత్రుడు, అభిమన్య కుమారా ! అని పిలుచును)

అభి:—అదిగో ! వింటివా ప్రియాసఖీ ! మరల కేక వినవచ్చెది.

ఉత్త:—ఇదిగో ! ప్రియసఖా ! దగ్గఱమాట వినఁబడని మీకు దూరము నుంచి యెక్కడో పిల్చెడి పిల్పులెట్లు వినబడగలవు ?

అభి:—ప్రాణేశ్వరీ; పట్టువిడుపులు లేని పట్టుదలలో సౌఖ్యమేమాత్ర ముండకు.

కేవలమింక నా ప్రియసఖీ ! బలవిక్రమ శౌర్యజాతి, మీ
స్త్రీవిభవైక సౌఖ్యము గుఱించి తనూధనమేమి పెంచలే
దే ! వసుధాతలమ్ము భరియించెడి దోర్బలభావవిశ్వవా
ణీవివరాలుఁ గూడ విననేర్చుటకై జనియించి యుంటిమే !

(తెరలోంచి మిత్రుడు, అభిమన్యకుమారా ! అభిమన్యకుమారా ! ఎంత పిలిచిననూ పలుకవేమయ్యా ! అని పిలుచును.)

అభి:—అదిగో ! నా మిత్రుడు చాలా తొందరపడుచున్నాడు.

ఉత్త:—మిత్రుడేగదా ! ఇంకా కేకలెందుకు ? వచ్చిమాట్లాడి పోంగూడదా ?

[తెరలోంచి మిత్రుండు, ఏమయ్యా అభిమన్యూ ! కౌరవాదులు చాలా దుష్టకార్యమునకు ఒడిగట్టినారు ! అని కేకవేయును.]

అభి:—కౌరవులా ? తిరిగి మతేమి దుష్టకార్య మబ్బా ? మిత్రమా ! లోనికి వేంచేయుము (ఉత్తరతో) నేను నా మిత్రునితో యీ వ్యవహారమేమిటో సమాలోచించుకొనెడి సందర్భమందు నా ప్రేయసీ ! నీ వేమియు మాట్లాడక,

ఉత్త:—నా కవసరమైన ప్రసంగములు వచ్చినప్పుడే మాట్లాడగలను.

(మిత్రుండు ఆయాసముతో ప్రవేశించును. ఉత్తర ప్రక్కకు వెళ్లి నిలబడి వినుచుండును.)

మిత్రు:—అమ్మా ! అమ్మా...

అభి:—ఏమిటి మిత్రమా ! ఏమిటి ?

మిత్రు:—అమ్మా ! అమ్మా ! ఇంత ఆయాసపడి వచ్చి ఎంతసేపటి నుంచి నేను గొంతు చించుకొనుచుంటినో నీకు...

అభి:— ఏమిటి మిత్రమా ! శత్రుశిబిరమున క్షేమైనా పొరబాటున పోలేదుగదా !

మిత్రు:—ఏమి శిబిరములో బాబు ! ఎక్కడి యుద్ధములో ?

అభి:—శత్రువులేమైనా వెంటబడిరా ?

మిత్రు:—నావెంటే పడుట యేమిటి ! నాలుగు సముద్రములంతటి తమ్ము లున్నట్టి ధర్మరాజును బంధించుకొనిపోవుటకుకూడా...

అభి:—ధర్మరాజును బంధించటమే ! ఎవరు ?

మిత్రు:—ఆ ఎన్నడూ యుద్ధముఖమెరుగని ధర్మరాజును బంధించుకొని పోవుటది వారికొక లెక్కయా ?

అభి:—(రోషావేశంతో) వారెవరో చెప్పవేమయ్యా?

మిత్రు:—ఎందుకొచ్చిన ఆఘర్దా! వారెవరైతేమటుకు నీవూ నేనూ ఏం చేయగలం.

ఉత్త:—(ప్రక్కనుంచి) ఇక్కడ మా పినమామగారన్నలేరే!

మిత్రు:—(ఉలిక్కిపడి చతికిలపడును.)

అభి:—(నవ్వి) భయములేదు చెప్పు మిత్రమా!

మిత్ర:—ఆ రెండవనోటి మాటెక్కడిది? ఖర్మంకాలి ఆ దుండగులు యీశిబిరంలో జొరబడ లేదుగదా!

అభి:—(ఉత్తరవంకజూచి నవ్వి) భయాభ్రాంతితో బుద్ధిచాంచల్యము కలుగుచుండును. (మిత్రునిచేయి పట్టుకొని లేవదీయుచు) మిత్రమా! భయములేదు. శత్రువులు కాదుగదా పాలాతునకి గూడా ఈ రాచబిడ్డల యుద్ధశిబిరములో అడుగుపెట్టుటకు గుండెలు చాలవు. ఏమిటో చెప్పు.

మిత్రు:—(బెదరు చూపులతో అంతఃపురము నల్దెపులా పారజూచుచు అభిమన్యుని దగ్గరకు తీసుకొని మెల్లగా చెవిదగ్గరకు తల జేర్చి అడుగును) వారెవరు?

అభి:—నా ప్రేమపాత్రులు.

మిత్రు:—అదిసరేలెద్దూ! నాకంటే నీకింకా ప్రేమపాత్రులు మరెవరున్నారు. చెపుదూ వారెవరో!

అభి:—అదిగాదయ్యా! నాప్రాణసమానులు.

మిత్రు:—సరేలేవయ్యా! నీప్రాణమువంటి వానిని నేనేగా! ఎవరో స్పష్టంగా చెప్పవాయేమి? మనము చాలా అవసరమైన విషయములు మాట్లాడుకొనవలెను. (తిరిగి బెదరుచూపులతో నల్దెపులా చూచును.)

అభి:—(నవ్వి) ఈవీరభారతభూమికి యీపిరికితన మెక్కడనుండి తెచ్చి తివయ్యా ?

మిత్రు:—ఎక్కడనుంచో తీసుకొనిరానేల ? ఇది యీకురుపాండవేయుల రెండు యుద్ధశిబిరాలలోనూ పుట్టినదే ! ఈలేచిన యుద్ధపుగాలి దుమారం అణగారిపోయినప్పుడుగాని యీపిరికితనంగూడా చల్లారిపోదు. ముందు వారెవరో చెప్పు మిత్రమా !

ఉత్త:—మీరు వచ్చినపని గూర్చి మీరు చెప్పిపోవటము మర్యాదగాని ఊరికే అనవసరముగా ఇంటిలోవున్నవారి ఆచోకీ మీకెందుకు ? (అభిమన్యునితో) ఎవరైతే వీరికెందుకు? వారడిగినది చెప్పవద్దు.

మిత్రు:—మీరడిగేదికూడా నేనూ చెప్పను. నా దారి నేను చూచుకొనుటయే మంచిది. (అని పోబోవును)

అభి:—(చెయ్యిపట్టుకొని ఆపుజేసి) మిత్రమా ! తొందరపడకుము. ఆమె పాండవేయుల రాజగృహమునకు ముచ్చటలు దీర్చెడి ముద్దు కోడలు.

మిత్రు:—(పెద్ద ముఖము చేసుకొని ఆశ్చర్యముతో) మా ఉత్తర టయ్యా ! ఈ ఉత్తర ప్రత్యుత్తరమునవే భానుబింబము ఇప్పటికి ఉదయించింది. అయితే భయము తీరినట్లే !

అభి:—మిత్రమా ! అసలువిషయము చెప్పకపోతివి. శత్రువులేమిటో ధర్మరాజును పట్టరావటమేమిటో సవిస్తారముగా విన్నవించుము.

మిత్రు:—అభిమన్యునామధేయా ! కౌరవేశ్వరుడైన సుయోధనుడు భీష్ముని వధానంతరము శస్త్రగురుడైన ద్రోణాచార్యునకు సర్వసైన్యాధిపత్యము కట్టబెట్టినందువల్ల ద్రోణుడు సంతోషాంతరంగుడై దుర్యోధనుడు కోరినప్రకారము ధర్మరాజును బట్టితెచ్చెదనని మాటయిచ్చెను.

అభి:—ఔరా! ద్రోణాచార్యా! నిఖిలధర్మనేత్రమైన అజాతశత్రువైన మా తండ్రిమీదనా నీ ధనుర్విద్యాకౌశలముజూపి కట్టవచ్చుట? తర్వాత మిత్రమా!

మిత్రు:—ఆ కురుసైన్యాధిపతియైన ద్రోణుడు రేపు బ్రహ్మాండమైన పద్మవ్యూహమువన్ని మన పాండవ చమూసమూహము నంతటిని సమూలముగా తెగటార్చివై చెదనని దుష్టకురురాజునకు మాటయిచ్చి, ప్రచండ ప్రతిజ్ఞఁబట్టి తగిన సర్వసన్నాహాలతో సిద్ధమగుచున్నాడు.

అభి:—ఔరా! బ్రాహ్మణసార్వభౌమా! ద్రోణాచార్యసునామధేయ!

ఆహవమందు తావక మహాశరశౌర్య విజృంభణంబు స
న్నాహములన్ని లేపి పకునాలుగులోకము లార్పుగాక; నీ
వ్యూహము లన్యసైన్యబలమున్ తలక్రిందులు సేయుగాక; యే
ద్రోహములేని ధర్మజుని ద్రోణుడ! నేనిక పట్టనిత్తునా!

విశ్వవీర భారత వీర విశ్వవిజయకుమారులైన వీరాభిమన్యుల ప్రచండ బలపరాక్రమ సాహసములు, అఖండ శరవిద్యాశేముషీ ధురంధరత్వములు నీ వెఱుంగకయే యీ తెరంగున కుంభసంభవా! వెఱ్ఱి వ్యూహములు పన్ని దేశద్రోహములు చేయబోవుచుంటివి గాబోలు!

నీ వ్యూహాలవి యెట్టివో కనగ నీ సర్వ(ద్రశస్త్రాస్త్ర వి
ద్యావ్యాప్తంబు లవెంతదాకఁగలవో త్రవ్వించి తర్కించు త
ద్దివ్యక్షేత్రమహేంద్రుడు మన్మడిక గద్దింపంగ సన్నద్ధినీ
చీవ్యాఘ్రప్రభుఘూర్ణమేఘుడయి లేచెన్; నిల్వు కుంభోద్భవా!

(అని లేవగా ఉత్తర వచ్చి చేయి పట్టుకొనును)

ఉత్త:—నా జీవితేశ్వరా! ఈ అనాలోచితమైన ప్రచండప్రతిజ్ఞలు పట్టుటకు మీరు సరియైన యీడురానివారుసుమా!

అభి:— మగువా! నీవు నా కడ్డురాకుము. ఇటువంటి దురాక్రమణ దేశద్రోహులు లోకవంచకులై సత్యసంధులపైకి నిఖిలధర్మవేత్తలపైకివచ్చి కవ్వించుచున్నప్పుడు నావంటి వీరభారత విప్లవయోధులెవ్వరూ శృంగారకేళీ సరోవరసుకుమార మరాళ విహారములు చేయజాలరు.

వీరరసప్రధాన పృథివీ పరమేశ్వరులౌచు నేడు మా
భారతవీరపుత్రులు ప్రపంచపతాకమువట్టి, విశ్వగం
భీరగళమ్ము మ్రోడ జయభేరినిగొట్టి స్వతంత్రరాజ్యల
క్ష్మీరథసంభ్రమంబు విలసిల్లెడిదాక ప్రతిజ్ఞఁ దప్పరే!

(తటాలున నిష్క్రమించును. ఉత్తర, మిత్రుడు అభిమన్యుని అనుసరింతురు.)

[తెరపడును]

# యుద్ధభూమి.

## చతుర్థాంకం.

### 1 వ రంగం.

(ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడు ప్రవేశం)

ధర్మ:—తమ్ములారా! వీరభారత విశ్వమహాజన కురుక్షేత్రసంగ్రామ రంగ సార్వభౌముండైన భీష్ముండు నడిసెనని మనమిప్పుడే మిడిసి పడి, బొమ్మలు విఱచుకొని తిరుగరాదు. కనులు మూసుకొని మైమఱచి యుండగూడదు.

ధనురాచార్యుఁడు విశ్వవీరపదవీ ధారాధరుండై సమ
స్త నభోమండలముం బ్రచండముగ బ్రద్దల్సేయు గంభీరగ
ర్జన గావించి శరంపు టగ్గిపిడుగుల్ రాల్పించి లోకమ్ము లె
ల్లను కంపింపఁగజేయు నింక మనపై లంఘించు నీక్షించుడీ.

భీము:—అగ్రజా! జయించిన రోజునఁగూడ నీవిట్లు నిరుత్సాహపఱచెడి భయసందేహ సందోహవిపరీత విభ్రమవాక్యాలు పల్కుట సమంజసముకాదు.

గురుడైనం హరుడైననేమి కదనక్షోణిం బ్రకంపింప జే
తురు నీ నల్గురు తమ్ములేరయిన; తద్ద్రోణుండు త్రైలోక్యభీ
కర ధారాధరుఁడౌచు పైబడమికిరాగా నీ సమీరాత్మజుం
డురుజంఝానిలుడౌచు వాని పడద్రోయుం జుమ్మి ధర్మప్రభూ!

(కృష్ణార్జునులు ప్రవేశింతురు)

కృష్ణ:—ఏమిటిబావా! ఎవరిపైన భుజాస్ఫాలనము చేయుచున్నావు?

భీము:—మిగిలిన దుష్టదుర్యోధనాదులమీద.

సహ:—కాదు! పొరబాటు. ద్రోణాచార్యుని మీద.

నకు:—కురుపాండవేయుల శరవిద్యాగురుపుంగవులమీద.

కృష్ణ:—అవును. భీమునిపాకం బ్రాహ్మణసార్వభౌముడైన ద్రోణాచార్యునను రుచిచూడ మనసు పుట్టినది కాబోలు !

భీమ:—బావా ! భీమపాకమేమిటి ? నేనన్నది నీ కర్థముకాలేదు గాబోలు !

కృష్ణ:—అర్థము కాకపోవుటేమిటి మారుతాత్మజా ! నీవన్ని పాకములను రుచిచూపించుటలో హస్తలాఘవము కలవాడవని మీ గురువు కుతూహలపడుచున్నాడంటిని.

భీము:—మా వెనుకటి పాకశాస్త్రములగుఱించికాదు నిన్ను చెప్పమన్నది.

అర్జు:—బావా ! వాసుదేవా ! ఏల యీ అకారణ వాచాకాలక్షేపములు?

కృష్ణ:—అదిగాదయ్యా పార్థివా ! మీ అన్న భీమసేనుని పాకశాస్త్ర ప్రావీణ్యము చులకన చేయతగినది కాదు.

ఇమ్మహి నీ వృకోదరుని నెవ్వ రెరుంగరు ? నేఁడు భీమపా
కమ్మున యుద్ధపాకమె జగన్నుతి కెక్కుటఁజేసి దానికో
నమ్మిక మీగురుండు మఱి జబ్బలు కొట్టుచు భీముముందు సి
ద్ధమయి యుద్ధపాకముగదా రుచిఁజూచు తరించు నట్లుగా.

ధర్మ:—దేవకీనందనా ! నీ చమత్కారచాతుర్యసౌందర్యోపాసనముందుమే మెంతవారము.

అర్జు:—కృష్ణా ! ఏల ఆలస్యము.

తమ భీష్ముండటు కూలిపోయెనని చింతాక్రాంతులై సర్వసై
న్యమహాంబోధి కృధాతరంగఘనవిన్యాసమ్ములై కోటపై
దుముకంగా పరవళ్ళు ద్రొక్కిరిగదా దుర్యోధనాదుల్ నిదా
నముచే శత్రువధావిధానము వృథా సర్ధానమై పోదటే ?

ధర్మ:—మత్తే సన్నాహాలతో కౌరవాదులు యుద్ధసన్నద్ధులగు చున్నారో !

కృష్ణ:—నాసహాధ్యాయులైన సోమదత్తాదు లఱువదివేల సైన్యముతో మనమీద దూకవచ్చుచున్నారు. నేనూ, అర్జునుడూ కలసి ముందా సోమదత్తుల నెదుర్కొనుట కర్తవ్యపరముగా పోయిరా వలయును. ధర్మజా ! నీవు భీమనకులసహదేవాది సైన్యముల తోబాటు మా సాత్యకిని దగ్గరపెట్టుకొని మన యుద్ధశిబిరము కాపాడుచుండుము. త్వరగా మేము వెళ్ళివచ్చెదము.

ధర్మ:—మంచిది ఈ యుద్ధ నిర్వాహణమంతయూ నీ భుజస్కంధముల మీదపెట్టి విశ్వసించుచుంటిమి కృష్ణా !

(కృష్ణార్జునులను సాగనంపుటకు ధర్మరాజు వెంటవెళ్లును)

సహ:—సోమదత్తులతో పోరు సామాన్యమైనదికాదు.

నకు:—రణరంగపరాక్రమసింహులు. సమస్తశరవిద్యాకోవిదులు.

భీము:—తమ్ములారా ! మీరు వందిమాగధులమాదిరి తయారగు చున్నారు.

> కోటి సోమసూర్యులకాంతి కలుగుచున్న
> పాండవేయుల కీర్తి కేవంక లేదు
> చండతర శాసనాఖండులుండ నయిన
> మద్గదాదండమున కెంగు మచ్చలేదు.

(ధర్మరాజు ప్రవేశం)

ధర్మ:—ఏమది భీమసేనా ?

భీము:—తమ్ములకు తోత్రమహిమ చెప్పుచున్నాను.

(అమ్మో! అమ్మో! అని గోలపెడుతూ మిత్రుడు ప్రవేశం)

ధర్మ:—ఏమిటి నాయనా ? నీ చెలికాఁడు అభిమన్యుఁడేడి?

మిత్రు:—ఎంత చెప్పినను వినక— మఱి మీఅభిమన్యుడు.
(ఆఁఆఁఆఁఆఁ అని యేడ్చును)

ధర్మ:—ఏమిచేసెనయ్యా? చెప్పుము భయము లేదు.

మిత్రు:—మఱి మీఅభిమన్యుడేమోనే; (ఆఁఆఁఆఁఆఁ అని యేడ్చును)

భీము:—(బిగ్గఱగా) ఏమిటి? చెప్పవేమిటి?

మిత్రు:—('అమ్మో' అని ఉలిక్కిపడి చతికిలపడును)

ధర్మ:—నీవేమనకు భీమసేనా!

సహ:—ఏమిటో చెప్పు.

మిత్రు:—అయ్యో! (అని ఉలిక్కిపడును)

నకులు:—ఏమిటో చెప్పు భయము లేదు మిత్రమా!

మిత్రు:—(గుండెలు కొట్టుకొంటూ) నన్నూ ఉత్తరనూ ఆఁఆఁ (అని యేడ్చును)

ధర్మ:—భయము లేదు. ఏమిటో చెప్పునాయనా! నిన్నూ ఉత్తరనూ ఏమిటి?

మిత్రు:—(లేచి, ధర్మజుని దగ్గఱకువచ్చి) ఆ భీమన్నగారిని చూచి నేనేమియూ చెప్పలేను.

భీము:—నేనేమన్నా?

మిత్రు:—(అమ్మో! అని ధర్మరాజు నడుం కౌగలించుకొంటాడు.)

ధర్మ:—మీరెవ్వరూ మాట్లాడకండి. భయము లేదింక ఏమిటో చెప్పు నాయన!

మిత్రు:—(భీమునివంక బెదురు చూపుల్తో చూస్తూ) ద్రోణాచార్యుల వారేమో ధర్మజుని బట్టి దుర్యోధనుడికేమో పట్టిచ్చెదనని గట్టిగా ప్రతిజ్ఞ చేసెనట. ఇది మీ అభిమన్యుఁడు విని తోకత్రొక్కిన

త్రాణుగా లేచి ఆయుధాలను తీసుకొని ద్రోణదుర్యోధనాదుల మీదికి దండెత్తి పోవుచున్నాడు. నేనూ ఉత్తరా ఎంతచెప్పినను వినక క్రోధావేశములతో బయలుదేరి పోవుచున్నాడు.

ధర్మ:—ఇదంతా జరిగిం దెప్పుడు ?

మిత్రు:—ఇంతకు ముందే !

ధర్మ:—భీమసేనా ! అభిమన్యుడు కడు చిన్నవాడు. మాటపడలేని పౌరుషముగల రాచబిడ్డ. నీవు తమ్ములతో సహితముగా సత్వరమేపోయి నెమ్మదిగా చెప్పి నాదగ్గఱకు తీసుకొనిరమ్ము. ద్రోణుడేమిటి ! నన్నుపట్టి దుర్యోధనుని కిచ్చుటేమిటి ? మహాశ్చర్యమైన విషయమే !

(అంతా నిష్క్రమింతురు)

తెరపడును.

## చతుర్థాంకం.

### 2 వ రంగం.

### అంతఃపుర శిబిరము.

(భీమ నకుల సహదేవ మిత్రులతోబాటు అభిమన్యుఁ డస్త్రధారియై ధర్మరాజు దగ్గఱకు ప్రవేశం)

ధర్మ:—నాయనా అభిమన్యు ! నీ వేమిటి శత్రుశిబిరమునకు పోవుచున్నావట ?

అభి:—రాచబిడ్డడను గనుక.

ధర్మ:—ననుగన్న తండ్రీ ! నీవు పాండవేయుల పంచప్రాణమైన పసివాఁడవు.

అభి:—అందువలననే అరిలోకసంహారమునకు నడుము కట్టుకొనవలసి వచ్చినది.

ధర్మ:—నాయనా !

మాకు మా యిలువేల్పుల శ్రీకృపా క
టాక్ష భాగ్యవైభవ కిరీటమ్మగా ప్ర
ధాన ప్రాణముసగ ప్రాప్తమైన తండ్రి !
నీ కరుల జోలియేల ? మాదు గుండెలు పగులగ !...

అభి:—తండ్రీ ! ధర్మరాజా !

ఎవఁడో కూటికి కౌరవాధముల కాళ్లేమో తలందాల్చి వి
శ్వవదాన్యుండగు పాండవాగ్రజుని నిర్బంధించి, తద్దుష్ట కౌ
రవ దైత్యాదుల ముందు కీల్పునని యారా ! ప్రేలినాడంట ! యే
యువరుల్ సైతురు ? సైచి పెద్దలిది యాయుర్దాయముల్ దాతురా ?

భీము:—నకుల సహదేవులారా ! వింటిరా వీరభారత విప్లవకిశోర గర్జన !

మిత్రు:—మన మార్జాల గర్జనతో సమానమైనదేనా ?

నకు:—ఓయీ బ్రాహ్మణవంశకీర్తి వినాశనా !

బాణములెన్ని యీ ప్రతినఁబట్టి విజృంభణమింక నీవు మా
ప్రాణసమానుఁడైన యమరాజ తనూజునిపైనఁ జేయు; ని
ద్రాణముగాదె పాండవ పరాక్రమసింహము; ధార్తరాష్ట్ర మా
గాణ మదేభ కుంభము లికం పగిలించకపోదు కాచుకో !

సహ:—అన్నలారా !

అలుఁగుటే యెరుంగని యీ మహామహు నికఁ
బట్టవచ్చినవాఁడు సప్తజలధు లిల
నేకమై యీ యఖండ మహీభయంక
ర ఘన భీమ హిమాలయ ప్రళయముగఁను...

మిత్రు:—అంతవరకీ గుడిగోపురముఁ జూడవలసినదేనా ?

భీమ:—ఓరా ధనురాచార్యా !

ఇంకెవ్వండిల గాచునోనిను; మఱింకే దిక్కు మొక్కున్నదో
బింకమ్మంతయు వీడి చూడుమిదిగో భీముండు నీకా ధను
ష్టంకార ప్రతిశబ్దదుందుభి ధ్వనీ శౌర్యోత్సవశ్రీకళా
ఝుంకారమ్ములు కట్టి పెట్టుటకు లంఘించుంజుమీ కుంభజా !

మిత్రు:—(మీసముమీద చెయ్యివేసి) ఏమనుకున్నావో! మా భీమావతారం లంఘించనే లంఘించదు. లంఘించెనా- లేచుటే లేదు !

ధర్మ:—నాయనా అభిమన్యూ ! నీ తండ్రులింతటి ప్రతిజ్ఞాగరిష్ఠులై, బలపరాక్రమ సముద్రులై యుండికూడా యీ ధర్మరాజును కాపాడుకొనలేనప్పుడు నీవు రోషావేశంబులు తెచ్చుకొన వచ్చుగాని, యిదేమిటి నాతండ్రీ? నీవు మా వంశోద్ధారకుఁడవు.

మా బంగారుకొండవు. లేత కనుగాయమైన నిను కుటిలరాజనీతి
పరాక్రమ వీరకర్ణార దుష్ట గురహంకారపూరితులైన యీ
శత్రువులమీదకు తరిమి, మేమందఱము మానవముద్రాలంకారు
లమై నిత్యభత్యపరిమాణపారాయణులమై యీ శిబిరాలలో
పడియుండగలమా పిచ్చితండ్రీ! (దగ్గఱకు తీసుకొని)

నా నగుమోముల య్యా! నిను నా రతనాల వరాల తండ్రి! నీ
లేనును మేను కంద పడలేనటువంటి దదేమి బాధయో
గాని జనించి మా యెడద గాయములౌను; మఱెవ్వడైన తం
డ్రీ! నిను కొంచెపుంజక గదియించుచు మోదిన మేము నిల్తుమా?

అభి:—తండ్రీ! ధర్మజా! నీకు భయమేమాత్రము వలదు. ఈ విజయ
కుమారుడు వీరాభిమన్యుడుగాని భీరుడుగాదు.

చిన్నదిదైన నీ కొదమసింగపుపిల్ల మదేభకోటిపై
కన్నగ దూకుఁగాని, చిఱుతెమ్మెరగుంపులు పర్వులెత్తు కా
ర్జొన్నపొలంబుపైన పడఁజొచ్చెడి యీ చెడుగొడ్లవోలె గ
డ్డన్నఁడు మేయఁబోదు భయమేటికి విన్నము నన్ను ధర్మజా!

దుష్టదుర్హ్యాంకార భూయిష్ఠులైన దుర్మద దురాశాపిశాచ నిశాచరకోటి
దుర్మోహబద్ధులైన యీ నీచదుర్యోధనాదుల జయసంప్రాప్తికోసము-

ఆహవమందట పద్మ
వ్యూహంబీ గురుఁడు పన్ను చున్నాడట! ఈ
వ్యూహము భేదించెడి స
న్నాహము చేయఁగలేరు నాకంటె రొరుల్.

[వార్తాహరుఁడు ప్రవేశం]

వార్తా:—ధర్మరాజా! నమస్కారములు.

ధర్మ:—ఏమిటి విశేషములు ?

వార్తా:—కౌరవసైన్యములు గురుడైన ద్రోణాచార్యులవారు పన్నిన పద్మవ్యూహము చూచుకొని మురిసిపడి మిడిసిపడి జబ్బలు కొట్టుచు మీసములు మెలివెట్టుచూ మనపైన కవ్వించుచున్నారు స్వామీ !

ధర్మ:—[ఆలోచనా నిమగ్నుడై వుండును]

భీమ:—అభిమన్యుడు చెప్పిన మాటలన్నియు వాస్తవమైనవి !

నకు:—నిస్సందేహముగా.

సహ:—యథార్థమేనన్న మాట !

మిత్రు:—(బెదురు మొగముతో) పద్మవ్యూహమంటే ఈసైన్యశిబిరములను ముట్టడించటమేనా ?

అభి:—అదిగాదు మిత్రమా ! పద్మబంధంగా సైన్యములను నెలకొల్పి లోపలకెవ్వరిని జొరబడనియ్యని జగాజెట్టులను ద్వారములందుంచి, మహాదిగ్గజను గొల్పించునట్లు శౌర్యసాహస విక్రమాదులను విజృంభింపజేసెడి అభేద్యమైన యుద్ధకోటన్నమాట.

ధర్మ:—వార్తాహరా ! ఇంకా విశేషము లేమిటి ?

వార్తా:—ఆ నెలకొల్పుచున్న పద్మవ్యూహ సింహద్వారమువద్ద యీశ్వర వరప్రసాదలబ్ధుండగు మహాబలిష్టుని సైంధవుని నిల్పుచున్నారు. పద్మవ్యూహ మధ్యభాగంబున అఖిల శరవిద్యాసముద్రుడైన ద్రోణుడు నిలబడి తదితర దుర్యోధన దుశ్శాసన కర్ణాదులను కోవు కాయునట్లు నిశ్చయించుకొన్నారు.

భీము:—ఔరా ! ధనుర్విద్యాపారీణా ! ద్రోణాచార్యాభిధానా !

నీ వేవ్యూహములింక పన్నగలవో, యేయే ధనుస్సాహితీ
ప్రావీణ్యంబులు పెక్కుచూపగలవో, తత్కౌరవశ్రేణి నేఁ

డే వీక్షింప మటిప్రభంజనసుతుం డే తెంచుచున్నాఁడు; నీ
దేవుం డెవ్వడో సైంధవుండెవడో మర్దింతుంజుమీ నిల్వుమీ.

(గద యెత్తి పోబోవును)

ధర్మ:—తమ్ముఁడా భీమసేనా! ఏల యీ అనాలోచితవాచాశౌర్య
విన్యాసము?

మిత్రు:—మీరుండండి స్వామి! ఆమాత్రపుఘూటైన మాటలన్నా అన
నీయండి.

ధర్మ:—మారుతాత్మజా! అసలైన ఉత్తమక్షాత్రకుల వీరాగ్రేసరులకు
ధీరోదాత్తలక్షణ మలంకారము తెచ్చిపెట్టును. తొందర పనికి
రాదు. మనమింతకుపూర్వము మన అభిమన్యుని అసందర్భపు
టాగ్రహము అరికట్టుటకేగదా యీ సత్యాగ్రహాశిబిరమునకు
రప్పించినది. అహింసావజ్రకవచధారణచేయుమని చెప్పుచున్నది.
ప్రస్తుతము ఆలోచించవలసినది పద్మవ్యూహమును భేదించుటను
గురించి. ఇది మనమనుకొన్నంత తేలికగా భేదింపబడునదికాదు.
దాని భేదోపాయముమనకెవ్వరికిని తెలియదు. కొంచెము మన
పసివాడైన అభిమన్యుఁడు తెలుసునని సాహసించి చెప్పుచు
న్నాడు. అభిమన్యునకు సాధ్యపడినదైననూ నా మనస్సొప్పుకొన
కున్నది.

అభి:—తండ్రీ! ధర్మజా! అనుమానమూ అధైర్యమూ వలదు. నిక్క
ముగా నేను పద్మవ్యూహమును భేదించగలను.

మార్తాండుల్ దిగి యడ్డువచ్చినను పద్మవ్యూహముంజెండి, స
త్కీర్తిం నీదగు హస్తినాపుర పురంధ్రీదివ్య విద్యున్మణీ
వార్తాజ్యోత్స్నను దేశదేశములపై వ్యాపింపగాఁజేతు; ని
ర్వర్తింతుం రిపులోకభీకర వధాప్రస్తానముల్ ధర్మజా!

(ద్రౌపది ఉత్తరతో ప్రవేశించును)

భీము: —అగ్రజా! శాంతిసహనాలకు సమయాసమములున్నవి. నిజముగా మన అభిమన్యుకుమారునికి పద్మవ్యూహ భేదోపాయము తెలిసియేయున్నది గాబోలు. ఈ అభిమన్యునకు తోడుగా నేనూ, నకులసహదేవులూ, కృష్ణుని సోదరుడైన సాత్యకి పోయి వచ్చెదము. కృష్ణార్జునులు మనదగ్గరలేని అవకాశమును జూచుకొని అస్త్రాచార్యుని యుద్ధవ్యూహములు బలిష్టముచేసుకొని, యింత కుటిలక్రౌర్యశౌర్యవిన్యాసములకు దిగి కవ్వించుచున్న యీ క్రూరదైత్యాధములనూ, కౌరవాధములనూ నమ్మి క్షమించరాదు. బెదరిపోరాదు. నిక్కముగా అభిమన్యుకుమారునికి తోడుపోయి పద్మవ్యూహమును పటాపంచలుచేసి రాగలను. ధర్మజా సందేహించవలదు. సెలవిమ్ము.

అభి:—తండ్రీ! ధర్మజా! ఈ పెదతండ్రి చెప్పినట్లుగా తక్షణమే పద్మవ్యూహబంధమును యీపినతండ్రులను తోడుపెట్టుకొని భేదించుటకు వెళ్ళెదను. నీవేమాత్రమింక శంకించవద్దు. ఇప్పటికే చాలా కాలయాపన చేసినాము. శత్రుబలములు ముదిటిపోవునుగూడ. తండ్రీ! ధర్మజా! సెలవిమ్ము.

వ్యూహములెన్ని యాగురుడు పోరున పన్నినగూడ నేను త
ద్వ్యూహములన్ని తుత్తునియ లొక్కనిమేషములోన జేతు; న
న్నాహరుడైన నెంతగురుడైన జయించని యట్లుగన్న స
న్నాహన చక్రవర్తులు ప్రభూ! భయవిస్మితులౌట పాడియే?

ధర్మ:—కుమారా! తండ్రులను గనుక వెంటనే నీవడిగినచొప్పున త్రిలోకభీకరమైన సంగ్రామభూమి కంపుటకు సమ్మతించలేకపోతిమి. నీవనినట్లు సింహకిశోరములకు చిన్నతనములోనే వేటకౌతూహలమైనట్లు ఉత్తమక్షత్రియవంశోద్భవులైన రాచబిడ్డలకు

చిన్ననాడే సమరకుతూహలము కల్గుటకూడా సహజమై యుండ
వచ్చును. నీవడిగినట్లు నీపినతండ్రులైన యీభీమనకులసహదేవు
లను సాయముతీసుకొని పద్మవ్యూహమును భేదించుము తండ్రీ!

అభి:—(ధర్మరాజు పాదములకు నమస్కరించును) తండ్రి ధర్మజా!
నమస్కారములు.

ధర్మ:—నాయనా! నిర్వక్రబలపరాక్రమసింహుడవై గురుని పద్మవ్యూ
హమును సత్వరముగా భేదించుము. (అని నమస్కరించుచున్న
అభిమన్యుని చేతులతో లేవదీసి కౌగలించుకొనును.)

ద్రోణ:—

చాలుంజాలును మీదుదీవెనలు; మీ శౌర్యప్రతిజ్ఞప్రభల్
మేలుంగీడును నేకరీతిగ మునల్లీలం జనుల్యూన్తురా?
మీలో నెవ్వరులేరె యుద్ధమునకై, మీవిల్లు మాచేతికిం
కేలా యివ్వరు; బాలుఁద్రోతురటె మీరీ యుద్ధగుండంబులో.

ఈ సువిశాల వీరభారత భూమిపై నేఁడిటువంటి అసమర్థతా
పూరులు అప్రయోజకశిఖామణులు జన్మించుటచేతనే కుటుంబ
కలహములు కులమతజాతి ద్వేషరోషములు హెచ్చుపెరిగిపోయి
స్వార్థబుద్ధి ముదిరిపోయి ప్రతియింటిలోను, ప్రతిసంఘములోను,
ప్రతిపల్లెలోను, ప్రతిపట్టణములోను అసహానవికారజాడ్యములు
అనుపమాన దౌర్జన్యకార్పణ్యప్రభుకళామాహాత్మ్యములు ప్రబలి
ఎక్కడికక్కడ శౌర్యాగ్నులు రగిలి యీవిధముగా ముక్కుప
చ్చలారని పసిబుడతలను, పతివ్రతామతల్లులను గొంతులుకోసి,
రాజసతామసములు పెనవేసి యీజగజ్జనని విశ్వసంసారమందు
భయంకరఘోరరాక్షసి తాండవించునట్లు శోకభీకరమహాజగత్స
ముద్రసంగ్రామసహస్రతరంగ సంక్షోభములు మిన్నుముట్టించి,
చిక్కుచీకట్లు పుట్టించివైచుట యీ అనంతకోటిధర్మతత్త్వవిశార
దులధర్మమా? లేక యీయమాయక విశ్వమహాజనులకర్మమా?

పైకి అజాతశత్రువులమన్న బిరుదు చాటించుకొని, లోపల ఎన్నటికీ తీసిపోని ఘోరశత్రుసంహారందీక్ష అణచిపెట్టుకొని గోముఖవ్యాఘ్రములుగా, పయోముఖ విషకుంభములుగా కనిపించి అమాయక జనుల యెడలు మరపించి, మాయారాజనీతి తంత్రజ్ఞులను, కపటనాటక వేషధారులను, దుష్టపదవీ వ్యామోహచిత్తులను, గజకర్ణ గోకర్ణ టక్కుటమార విద్యలు నేర్చిన మైరావణులను, పరద్రవ్యాపహరణ పారాయణ కర్తలను, బహుసంసార మృష్టాన్నలంబోదరులను నాయకులుగా వెంటబెట్టుకొని, డప్పులు కొట్టించుకొని ఎన్నటికీ మరపునకురాని యీఅశాంతి వాతావరణములో తల్లులను, పిల్లలను వదలిపెట్టి, పనికిమాలిన యుద్ధశిబిరాలుకట్టి కడుపులోచల్ల కదలని యిటువంటి పెద్దపెత్తనములకు నడుములుగట్టి, హాయిగా స్థాయిగా మెల్లగా చల్లగా కాలముబుచ్చుచు మాపసికందులను, మాసుగాత్రులను మాబాలభారతవీరాభిమన్యులను బొల్లిబొల్లిమాటలతో బులిపించి, భయంకర యుద్ధబడబాగ్ని గుండమున దుమికించుచుండిరిగా! నాగొంతులో ఊపిరున్నంతవరకు, నాచూపులో విశ్వసంరక్షకుని పరాశక్తి వీరవిప్లవజ్యోతిగా వెలుగుచున్నంతవరకు యిటువంటి అనర్థదాయకములైన దేశాహితములైన అవినీతికార్యములకు నాబిడ్డలను, నాబంగారు కొండలను వొప్పజెప్పను. ఇంకెవరిని వొప్పజెప్ప నీయను.

గుండెలుకావె మీవి; పసికుర్రని మెల్లగ దింపుచుండిరా
మండెడి యుద్ధగుండమున; మారతనాల వరాలతండ్రి మా
కుండగ కాలముం గడుపుచుంటిమిగాని, త్వదీయ జీవితా
ఖండలవైభవోన్నతికి గాదు; రణప్రభ మీరెలేపుడీ.

అభి:—తల్లీ! వీరభారత జగజ్జననీ! భయపడకుము.

ఇంతటి శాంతిదాత మఱియింతటి శౌర్యజగజ్జనైక దృ
ష్టాంత యశోవిశాలకలశాంబుధి ధార్మికచక్రవర్తి; వై
క్రాంతదిగంతశోభిత సుదర్శనధారిని కేలఁబట్టి ని
శ్చింత రణప్రభల్ కులుకఁజేసెను నాకెదురేది తల్లిరో.

ద్రౌప:—నాతండ్రీ! నా బాలభారత వీరాభిమన్యూ!
నీపైఁదీసి మఱెంత వేపెడిదియో నీతల్లికింగాక, నా
నాపైశాచికయుద్ధముల్ నడుపు సన్నాహమ్ములోఁబడ్డ యీ
భూపశ్రేణి కదేమి బోధపడు? నా మొప్రేంలతండ్రీ! జయ
శ్రీపంకేరుహ నేత్రి తన్ముఖసుఖశ్రీ నేమివాంఛించదా?

ధర్మ:—నా హృదయేశ్వరీ! పుత్రప్రేమ కేవలము తల్లులకేగాదు తండ్రులకు గూడా కలదని విశ్వసించుము ఈ అల్పరాజ్య వైభవశ్రీ కోసము, ఈ అఖండ సామ్రాజ్యలక్ష్మీజగజ్జేగీయ మాననిరుపమాన సద్యశోధన సింహాసనముకొఱకు మేమీ యుద్ధరంగమున ప్రవేశించలేదు. సాధ్వీ! అసలుమేము ధర్మ యుద్ధకంకణధారులమై, యీ వీర భారతమహాసంగ్రామ విశ్వ జనశాంతి సౌఖ్యసమన్వయ సత్యాగ్రహ మార్గపురోగాములమై, యీ వీరభారతమహాసంగ్రామ విశ్వవిప్లవరంగమందు నడుము గట్టినదికూడా భావికాల మానవ జీవితముల గుఱించియే. ధర్మ నిర్వహణకు, జన్మసాఫల్యముకొఱకు పిన్నపెద్దల తారతమ్యము లేకుండ కలసి పురోగమించవలెను.

మన గడ్డఁగల బిడ్డలందఱు రణత్సోమండలీ శౌర్యధై
ర్యన్నృసింహుల్ వలె పెర్గువారలయి ధర్మక్షేత్ర సత్క్షాత్రవీ
రనినాదంబులు మిన్నుముట్టెడి జయప్రాగల్భ్య వాల్లభ్యభూ
జనవిఖ్యాతి గడించనిమ్ము నవమోహారత్న విద్యుల్లతా.

తమ్ములారా! భీమనకుల సహదేవులారా! మన బాలభారతవీరాభిమన్యునకు మీరు తోడుపోయి పద్మవ్యూహమును పటాపంచలు చేసిరంట.

అభి:—తల్లీ! నమస్కారములు (ద్రౌపదికి నమస్కరించును)

ద్రౌప:—నాయనా! నాకు నీ వొక్క బాలభారత వీరసింహకిశోరుని సాహసమే యీ దుష్టదుర్యోధనాదుల మాయవ్యూహములు పటాపంచలుచేయుటకు చాలదు. నీ సాహసము నా కేమియు నచ్చుటలేదు. నీ వంటి బాలభారతవీరాభిమన్యులకు తోడుగా యీ వీర భారతమహిళామండలినిగూడా తయారుచేసుకొననిదే యీ బానిసదేశ దాస్యబంధనాలు తెగవు. రమ్ము ఉత్తరా!

(ఉత్తర, ద్రౌపది నిష్క్రమింతురు)

అభి:—తండ్రీ! నమస్కారములు.

ధర్మ:—నాయనా! జయము సాధించవలయును.

(ధర్మరాజు అభిమన్యుని వెంటబెట్టుకొని పోతుండగా మిత్రుడు గభాలున తుమ్మును. వెంటనున్న భీముడు గ్రుడ్లెఱ్ఱజేసి గద మొత్తగా గావుకేక పెట్టి పరుగెత్తును.)

(తెర పడును)

# యుద్ధ భూమి.

## పంచమాంకం.

### 1 వ రంగం.

### పద్మవ్యూహము.

(సైంధవుఁడు, ద్రోణుఁడు, ప్రవేశం)

ద్రోణు:—నాయనా సైంధవా ! వీరలోకబాంధవా !

బంధువులందు పెక్కురు నృపాలురు బంధురమైన సత్కృపా
సింధులు శౌర్యధుర్యులు విశేషముగా తనకున్న, నీ భుజ
స్కంధముపై సమస్తమును కౌరవనాథుఁడు మోపె; శత్రుగ
ర్వాంధులకీవు నేఁడు ప్రళయాంబుధివై కనిపించు సైంధవా !

సైంధ:—మహాత్మా ! నిఖిలశస్త్రవిద్యాప్రవీణా ! జగదేకవీరులైన పాండవేయులను నేనొక్కఁడను నిలిచి ఎదిరించగలనా ! అడ్డగలనా ?

ద్రోణు:—నాయనా ! ఈశ్వరవరప్రసాదబలధురీణా !

నిను నేఁడెవ్వఁడు నెట్టి నెగ్గుటకు జన్మించంగ లేదింక; శౌ
ర్యనిధుల్, విశ్వమహాధనుర్ధరుల్, హరిహరబ్రహ్మల్ మతులొప్పగ త్వ
ద్ఘనదోర్బాహుబలైక సాహసకళాధారాధరశ్రేణి భం
డనభూమిం శరవృష్టిదించ ధర మున్కల్వోయునో సైంధవా !

సైంధ:—మీవంటి త్రిభువనైక శరవిద్యా నిపుణులు అంత మెచ్చుకోదగిన రణవిద్యాప్రభావములు నాదగ్గఱ లేవనియే భావించెదను.

ద్రోణు:—సైంధవా ! అట్లెన్నటికిని భావించవలదు.

ఈవు సమస్తలోక పరమేశ్వర దివ్యవరప్రసాదల
క్ష్మీవిభవంబు జేసి బలమేరువుగా విలసిల్లువాడవై
నావు; యథార్థమిద్ది; భువనమ్ములపై నిను గెల్చువాడు లే
డీ వసుధాతలేంద్ర దనుజేంద్ర సురేంద్రులలోన సైంధవా!

(ముందుకు జూచి)

అదిగో! ఈభువనైక శౌర్యవిజయవ్యామోహ గంభీరుఁ డ
ల్లదిగో! యాకలితోడ దూకెడి మహాహార్యత్ముఁడై శత్రుసై
న్యదళాఖండ మదేభయూథఘన కుంభస్థాన పంక్తిం బదా
బదలుంజేయగ వచ్చుచుండె నీక సౌభద్రుం డుదగ్రుండుగాన్.

సత్వరమే నేనీక యీపద్మవ్యూహ సర్వసైన్య నివహాంబులకు హెచ్చరికజేసి యుద్ధసన్నద్ధుఁడనై యుండుటకు పోయెదరా యును. నీవు నీ ఈశ్వర వరప్రసాదలబ్ధబల వైభవంబున వ్యూహాంబులోపల కేవ్వరిని జొరబడనీయనట్లు తరుముచుండవలెను. అర్జునుని కుమారుఁడైన అభిమన్యుని వేయి విధము కోపుకాచి జొరబడనీయకుండ నీ యనివార్య రణశౌర్యబలసం దంతయును ధారబోయుచుండవలెను. ఒకవేళ సన్నాపార్థ కుమారుడెదిరించి తప్పించుకొని వ్యూహాంబులో జొచ్చినను వానికి తోడుగా యొక చీమనుగూడ జొరనీయకుండ కడు జాగరూకతగా మెలంగి పెనంగవలెను.

సైంధ:—చిత్తము గురుదేవా! నమస్కారములు.

(ద్రోణుడు నిష్క్రమించును—తెరపడును)

## పంచమాంకం.

### 2 వ రంగం.

(సైంధవుఁడు నిలబడివున్న పద్మవ్యూహసింహద్వారము దగ్గఱకు అభిమన్యు భీమ నకుల సహదేవ మిత్రాదులు ప్రవేశించుచూ)

మిత్రు:— అదిగో! సైంధవుఁడాతఁడే కాఁబోలు. త్రిలోకవీరఘాలాక్షుపై నిప్పులు చెఱుగుచున్నాఁడు.

నకులు:— అనివార్యశౌర్యరణసింహుఁడు.

సహా:— అఖండ శివప్రసాద బలతేజోధురీణుఁడు.

భీము:— తమ్ములారా! మనము ఉత్తమక్షాత్రవంశ సంభూతుల మన్నమాట మఱచిపోయినారా?

ఎపుడీ సైంధవుఁడన్న మీకిల భయంబేపారె! అవ్వాని ము
న్నెపుడో కాలను రాచివైచితిమిగాదే! యిద్ది మీరప్పుడే
అపహాసంబుగఁ జూడగా మఱచిరే? యీసింధురాజాధముం
డిపుడేమౌనో కనుంగొనుండు మఱి నాయీ ముష్టిఘాతంబుతోన్.

త్రు:— ఏమౌను! తిరిగి భీమావతారమును మించిన గామా మాదిరి తయారౌను.

ము:— కాదు. అధఃపాతాళలోకంబునకు అప్పడమై అంటిపోవును.

త్రు:— అయితే స్వామీ! వెనుక మీరందఱూ కాలితో రాచి పారవేసిన పులిస్వారివంటి వాఁడిప్పుడే యీమాదిరి హిమాలయముగా తయారైల్లాయయి యెదిరించనిలబడినాడు!

నకు:— మా ధర్మరాజు దయాదాక్షిణ్యమువలన.

సహా:— ప్రాణములు కుదుటఁబడి బ్రతికిపోయినాడు.

మిత్రు:— అసలు దెబ్బతిన్నవాఁడు, మాటపడ్డవాఁడు ఇంతకు వెయ్యి రెట్లు బలముగలవాడౌనేమో అనుకొంటాను.

అభి:— తండ్రులారా! అదిగో సైంధవుఁడు మనపైన బాణము సంధించుచున్నాఁడు.

భయమును జెందకుండ నయ్యయింక విలయజ్వాలల్ పొగల్గ్రక్కి వి
స్మయముల్ బల్విభ్రమముల్ జనించునటులస్త్రమ్ముల్ ప్రయోగించి అ
క్షయతూణీరము లీశ్వరేశ్వర కటాక్షమ్ముల్ ప్రసాదించు ని
ర్ణయుడై సైంధవుడడ్డె; వీని బలగర్వ మ్మేమిటో జూచెదన్.

మిత్రు:- అమ్మో! అదిగో సైంధవుడు అగ్నిపర్వతము పగిలినట్లైనాడు.

భీము:— కానిమ్ము. వీనికుటిల కౌటిల్యక్రౌర్య మదమాత్సర్యగర్వసర్వస్వము యిప్పుడే యుడిగింతును. తమ్ములారా! నకులసహదేవులారా! సంసిద్ధముకండి.

మిత్రు:— సరే-సరే తోడువాళ్ళుకూడా కావలయునన్నమాటేనా?

అభి:— మిత్రమా! సైంధవుడు నారిసారించుచున్నాడు. భయపడకుము

(సైంధవుడు ప్రవేశించి)

సైంధ:— ఓరీ కౌరవరాజదూషణ పరాయణులారా! పాండవులారా! నేడు మీకు మూడినది తెలియకే కట్టుకట్టుకొని వచ్చినారు. ఇదిపద్మవ్యూహము. దీనినిర్మాణకర్త త్రిలోకైక శస్త్రాచార్యుడైన ద్రోణాచార్యుడు. పద్మవ్యూహ గర్భకుహారంబున అనంత శతసహస్రకోటి భయంకర సంగ్రామ యోధ నివహంబులు, సహస్రకోటి మదమాతంగ తురంగ వజ్రవైడూర్య రధంబులతో సాయుధులై, అతిరథమహారథశ్రేష్ఠులై దుర్యోధన దుశ్శాసన కర్ణాదులు కోట్లుకాయుచున్నారు. త్రిభువనధనుర్లోక భీకరుడైన ద్రోణాచార్యుడు వ్యూహమధ్యభాగంబున మధ్యందిన మార్తాండుడై సర్వసైన్యాధిపత్యము నిర్వహించుచున్నాడు. ఇటువంటి అభేద్యమైన పద్మవ్యూహ ద్వారమందింకెటువంటి వాడుండు గ్రహించి వచ్చినదారిం బట్టుడు.

భీము:— ఔరా! దుష్టచతుష్టయసంబంధవాచాలా! సింధుదేశక సీమ మార్జాలా!

ధైర్యంబేమిటో, నీధనుర్గురుని పద్మవ్యూహామింకేమిటో
శౌర్యస్థైర్య చమూసమూహబల దక్షత్వం బదెంతెంతదో
క్రౌర్యంబంతయు కర్గిచూచెదములేరా ! నీవు నీబుద్ధి చా
తుర్యంబెల్లను కట్టిపెట్టి చనుమీ దుర్గర్వచూడామణీ !

సైంధ:—ఓరీ ! అసమర్థతాశూర ! వృకోదరా ! నీదిముష్టియుద్ధమా ?
వీరముష్టియుద్ధమా ?

అభి:—ఓరీ! దుర్గర్వాంధబాంధవా ! సైంధవా !
వెనుకటి దెబ్బలెవ్వరికి వీపునబొబ్బలు పొక్కి పుండుల
య్యెనొ కనకుండవాగక; మఱీవొకతెక్కియె యీమహాప్రభం
జనసుతుముందు; నీకల ప్రచండమహాబలరుద్రుఁడేల ? త
త్తనయుని నన్ను డీకొనుము, త్వద్రణపాటవమెల్ల జూపగా.

(అని శరప్రయోగముజేసి సైంధవుని దిగ్భ్రమగొల్పి తప్పించుకొని
పద్మవ్యూహములో జొరబడును)

సైంధ:—(తీవ్రముగ)
ఓరీ ! పాండవులార ! నిలుడీ ! యొక్కొక్కనిం జీల్చి మీ
వీరాటోపము లేమిటో కనెద; మీ వీరాభిమన్యుండు దు
ర్వారవ్యూహ దవానలప్రళయ సంగ్రామోగ్ర దీవ్యచ్ఛమూ
హారం బయ్యెను; రండు ! మిమ్ము యమసింహద్వారమందుంతురా

భీమ:—ఓరీ దుర్మదాంధా ! సైంధవా !
మును పెవ్వండును మద్గదాప్రహారణంబుల్ తిన్నతర్వాత భూ
మిని లేవంబడినట్లు లేదుగద; బల్మిం జెండి నీ కండక్రొ
వ్వను మాభారతయుద్ధయజ్ఞ శుచిదంభోళి ప్రభుస్వామి పా
హాస్తంబుల ధారఁబోతు నిక దేవప్రీతిగా దుర్మతీ !

(నిష్క్రమించును)

---